# ఆలోచనా లోచనాలు

(కవితా సంపుటి)

మహాకవి

డా. దాశరథి

కళాప్రపూర్ణ

మహాంధ్ర ప్రచురణలు

90-c, V. M. Street

మద్రాసు-4.

ALOCHANA LOCHANALU
(A Collection of Poems) by Dr. Dasarathi
First Edition : 1975
Cover Design : Bapu

మూల్యం : రూ. 5-00



ప్రతులకు :

1. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాదు-3.

ముద్రణ . క్రాంతి ప్రెస్, మద్రాసు-1.
ముఖచిత్ర ముద్రణ : మెడ్రాస్ జాబ్ ప్రెస్, మద్రాసు-2

# అంకితం

మన ప్రియతమ ముఖ్యమంత్రి
స్నేహశీలి దయాశాలి



శ్రీ జలగం వెంగళరావుగారికి

# ప్రజానాయకుడు జలగం
# ప్రజలే ఆయన బలగం

తెలుగు కొలనులో విరిసిన జలజం
తెగువగల మన ముఖ్యమంత్రి జలగం

ప్రజా రథాన్ని ప్రగతిపథం మీద
సజావుగా నడిపించుకుపోగల నాయక తురగం;
నిశ్శబ్దంగా, నిర్మమంగా, కార్యాచరణ ద్వారా
నిఖిల ప్రజల హృదయాలలో మ్రోగే 'సర్గం'*

నరకప్రాయమైన కర్షక, కార్మిక జీవితాలను
నవ పథకాల ద్వారా చేస్తున్నాడు స్వర్గం;
మంచివారిని అలరించే మధురమైన రాగం,
వంచకులను వణికించే భీషణనాగం

అలనాడు మహా హజం చూపిన నిజాంను ఎదిరించి
భళేగా పోరాడిన యువకవీర కంఠీరవం;
ఉరికంబమైనా, కారాగారమైనా, సంకుల సమరమైనా
వెరపులేక ముందుకు దూకిన పౌరుష జలధితరంగం

తెలుగువారంతా ఒక్కటి అనడం మాత్రమే కాదు
దేశప్రజలంతా ఒక్కటనే విశాల హృదయం;
అట్టడుగున చీకటిలో పడివున్న నిరుపేదలకు
ఆనందోత్సాహాల నిచ్చే వెలుగుల ఉదయం

---

* సరిగమ

తెలుగుజాతి ముక్కలు కాకుండా కాపాడినవాడు
తెలుగుభాషను రతనాల అందలం ఎక్కించినవాడు
ప్రజలకోసం బ్రతుకు అంకితం చేసిన నాయకుడు
పదికాలాలపాటు ముఖ్యమంత్రిగా ఉండవలసిన ఉత్తముడు

డొంక తిరుగుడు తెలియనివాడు, ముక్కుకు సూటిగా వెళ్ళేవాడు
పంకం వంటి ప్రపంచంలో పద్మంలా విరబూసినవాడు;
అఖిల భారత చిత్రపటంలో ఆంధ్రప్రదేశానికి
అపురూపమైన స్థానం కల్పించిన సమర్థుడు

కార్యవాది, ఆశావాది, సామ్యవాది జలగం —
అనుకున్నది ఆచరించి చూపడమే అతని ఆదర్శం
మిత్రుణ్ణి పుత్రునికంటే మిన్నగా చూచుకునే తత్వం;
ఎంత ఉన్నతి పొందితే, అంత నమ్రత అతని ధ్యేయం

ప్రపంచ తెలుగు మహాసభలు జరిపించాడు
సభూతో నభవిష్యతి అనిపించాడు
భాషద్వారా భావ సమైక్యత సాధించాడు
తెలుగు తల్లి పాదాలను ఆరాధించాడు

నాజీల తలపించు నైజాము చర్యల
నెదిరించి ప్రజల రక్షించినావు,
గూండా రజాకార్ల గుండెలు చెండాడి
మతతత్వ వాదమ్ము మాపినావు
ధనిక భూస్వాముల దమననీతి నెదిర్చి
బక్క రైతులను కాపాడినావు
అధికార భాషగా అవతరింపగజేసి
తెలుగు భాషకు కీర్తి తెచ్చినావు

సమరమున నీకు చెరసాల చంద్రశాల,
ప్రజల పోరాటమే నీకు బంతియాట;
ఆంధ్రజాతికి నీ సేవలంకితమ్ము;
వీర వెంగళరాయ! కవీంద్రగేయ!

కష్టించి పనిచేయు కర్షకావళిపైన
దయజూపు దీనబాంధవుడ వీవు,
గ్రామసీమల ధాన్యలక్ష్మి గాదెలనింపు
వ్యవసాయరంగ ధూర్వహుడ వీవు
ఆంధ్రమందు పరిశ్రమాభివృద్ధిని గోరి
పదకాలు వేసిన ప్రాజ్ఞుడీవు
తెలుగు దేశములోన చలన చిత్రమ్ముల
నిర్మితికై ఊతనిచ్చినావు

పగలు రేయని లేక నిర్భాగ్య జనుల
సేవ యొనరించు నిస్స్వార్థజీవి వీవు;
గాంధి నెహ్రూల శాంతి మార్గమ్మునందు
పయన మొనరించు సంతత పదికుడీవు

తెనుగు నేలను ముక్కలొనరించ, వేసిన
యెత్తుల ఆట కట్టించినావు
ఢిల్లీకి తరచుగా వెళ్ళుట తగ్గించి
పల్లెకే పలుమార్లు వెళ్ళినావు
అఖిలభారతములో ఆంధ్ర మాతృశ్రీకి
ఎనలేని కీర్తి కల్పించినావు
పరభాషపై మోజుపడువారి నాల్కకు
తెలుగు తేనియ రుచి తెలిపినావు

కూతలను, కోతలను నీవు కోరవెపుడు,
చేతలే నీకు సర్వదా ప్రీతి గూర్చు;
ఈ ప్రజాస్వామ్య సామ్యవాద ప్రపంచ
మందు విశ్వాసమున్న నాయకుడ వీవు

నాడును నేడును ప్రజలకు
తోడై నీడై ప్రశాంతి దోహదకరమౌ
జాడలలో పయనించిన
వాడువు, నీ కెప్పుడుఁ శుభంబగుగాతన్

ముప్పదేడుల మన స్నేహమునకు చిహ్న
మౌనటుల నిత్తు ప్రేమతో అంకితమ్ము
నాదు "ఆలోచనా లోచనాలు" నేడు,
అందుకొనవోయి! మిత్రమా! ఆదరమున.

# స్వీకారం

## ముఖ్యమంత్రి

## శ్రీ జలగం వెంగళరావుగారు

**ము**ప్పై యేండ్ల మా స్నేహానికి గుర్తుగా తన "ఆలోచనా లోచనాలు", అనే కవితా సంపుటిని నాకు అంకితం చేస్తున్నాడు మిత్రుడు దాశరది. నేను ఈ గౌరవానికి ఎంతవరకు అర్హుణ్ణో నాకు తెలియదు. నా అర్హతకన్న, దాశరధి అప్యాయత నన్ను ఈ అంకితం తీసుకోడానికి ప్రోత్సహించింది.

భారత స్వాతంత్ర్య పోరాటంలో అఖరుపుట్టమైన హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటం రోజుల్లో, నేనూ దాశరధీ ఒకే 'క్యాంపు'లో, కలిసి పని చేశాం. ఆనాడు మాకు మృత్యువు అంటే భయమేలేదు. వయసు పైనపడిన కొద్దీ, ఇప్పుడు కొంత జంకు అనిపించవచ్చు కాని ఆనాడు ప్రజల శత్రువులను దెబ్బతీయడానికి ఎంతటి ప్రమాదాలకైనా, ఎంతటి కష్టాలకైనా మేం వెనకాడలేదు.

మేం స్వామీజీ అనుచరులం. ఆయన సంస్థాన ప్రజా ఉద్యమంలో ప్రధాని నెహ్రూగారికి కుడిభుజంగా వుండేవారు. నెహ్రూజీ ఎంతో ప్రేమతో భారత జాతీయ పతాకాన్ని స్వామీజీకి ఇచ్చారు. ఆ పతాకాన్ని హైదరాబాదులో 1947 ఆగస్టు 15 నాడు యెగరవేయడం జరిగింది. దానితో— నాటి హైదరాబాదు సంస్థానంలో స్వాతంత్ర్య ఉద్యమం ముమ్మరంగా సాగింది. నీతి, నిజాయితీ లేని మతోన్మాదులైన రజాకార్లనూ, పోలీసు మూకలనూ, సైనికులను సైతం యెదుర్కొని, గ్రామాలలోని ప్రజల మాన, ప్రాణాలను కాపాడాలనే ఉద్దేశ్యంతో రాష్ట్ర సరిహద్దులలో క్యాంపులు ఏర్పరచుకుని దెబ్బకు దెబ్బ తీశాం అప్పుడు ఉద్యమం రెండు స్థాయిల్లో సాగింది. సత్యాగ్రహం చేసి జైళ్ళకు వెళ్ళేవారు కొందరైతే, రహస్య జీవితం గడుపుతూ శత్రువును యెదుర్కొనేవారు కొందరు.

చాలా పోలీసు [1]'చౌకీ'లమీద, [2]'నాకా'లమీద, దాడిచేశాం. దానితో నాటి నిరంకుశ ప్రభుత్వం వెన్నెముక విరిగింది. అయితే కొన్నాళ్ళకు దాశరథి జైలుకు వెళ్ళక తప్పలేదు. నాకూ రెండుసార్లు జైలు జీవితం తప్ప లేదు. ఆ ఉద్యమంలో యెందరెందరు బలి అయ్యారో చెప్పలేను. అల్లీనగరం నుంచి బీబీనగరం వరకు సాగిన హింసాకాండను ప్రజలు ధైర్యంగా యెదు ర్కొన్నారు అటు మరాఠ్వాడాలో, కర్ణాటకలో ప్రజలూ, వాలంటీర్లూ వీరోచిత పోరాటాలు జరిపారు

స్వామీజీ రాజీ యెరుగని విప్లవవీరుడు. మహామనత వహించిన నిజాం ప్రభువు ఛత్రచ్ఛాయల్లో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని (జిమ్మేదారానా హుకూమత్) కోరిన మితవాదుల ధోరణిని ఆయన యెన్నడూ అంగీకరించ లేదు. ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు సంస్థానం, యెట్టి షరతులు లేకుండా పూర్తిగా విలీనం కావాలి, తమతోటి సోదరులతో సమానంగా సంస్థాన ప్రజలు స్వాతంత్ర్యం అనుభవించాలి, అనేదే స్వామీజీ పట్టుదల.

నాటి హైదరాబాదు సంస్థానంలోని మూడు భాషాప్రాంతాలు విడిపోయి తమ సోదరులతో కలిసిపోవాలనే అభిప్రాయంకూడా మాకు ఉద్యమం రోజుల్లో కలగకపోలేదు. మొన్న ఉగాదినాడు మనం ప్రపంచ తెలుగు మహాసభలు జరుపుకున్నపుడు నా అధ్యక్షోపన్యాసంలోనూ ఈ విషయం జ్ఞాపకంచేశాను. స్వార్థపరులైన ఆనాటి సంస్థానాధీశ్వరులు కొందరు, ఇంగ్లీషువారితో లాలూచీపడి ఏర్పాటుచేసిన కృత్రిమ సరిహద్దులు యెన్నటికైనా చెరిగి పోవలసిందే— అన్న మా కలలను పండిత్‌జీ నిజంచేశారు. నిజామాబాదులో జరిగిన చారిత్రా త్మక సభలో, హైదరాబాదు సంస్థానాన్ని భాషాప్రయుక్తంగా విభజించడానికి నిశ్చయించినట్లు నెహ్రూగారు ప్రకటించారు. అది అభ్యుదయ శక్తులకు ఘన విజయం. 1956 లో తెలుగు మాట్లాడే ప్రజలున్న ప్రాంతాలన్నీ కలిసి ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడింది. ఆ తరువాత కొంతకాలానికి దురదృష్టవశాత్తు తెలుగువారి ఐక్యతకు భంగం కలిగించే రెండు వేర్పాటు ఉద్యమాలు వచ్చాయి. ఏమైతేనేం— పొరుపులు సర్దుకుని సమైక్యత నిలబడింది. మన రాష్ట్రంలో

---

1. చెక్‌పోస్టులు. 2. పోలీసుస్టేషనులు

శాంతి నెలకొన్నది. ఎన్నో కష్టనష్టాలను వోర్చి మనం సాధించుకున్న ఐక్యతను, శాంతిని భంగపరచడానికి ఎవరైనా ప్రయత్నిస్తే, వారిని ప్రజలు క్షమించరని మరోసారి హెచ్చరిస్తున్నాను.

మొదటినుంచీ ఆంధ్రుల ఐక్యతకోసం, విశాలాంధ్ర రాష్ట్రంకోసం కలలుకన్న దాశరథి ప్రజాకవి, మహాకవి విశాలమైన భావాలుగల కవుల వెంట ప్రజలెప్పుడూ వుంటారు. దాశరది నేలవిడిచి సాముచేసే, కవికాడు. దేశ సమస్యలే అతనికి ప్రేరణ ప్రజలే అతనికి చైతన్యమూర్తులు. 'జనం మనం, మనం జనం, జనం లేంది మనం లేము' అంటాడు దాశరథి కలం నుంచి వెలువడే ప్రతి కవిత మన తెలుగు భాషకు, సంస్కృతికి, భావ సమైక్యతకు తోడ్పడుతుందని నా విశ్వాసం అతని ఆంధ్రాభిమానం మరువ రానిది.

యెంతో ప్రేమతో తన 'ఆలోచనా లోచనాలు' నాకు అంకితం చేసిన దాశరధికి కృతజ్ఞుణ్ణి. ఆనందంతో ఈ కావ్యాన్ని స్వీకరిస్తున్నాను. ఆంధ్ర జాతికి, ఆంధ్రమాతకు కానుకగా అందిస్తున్నాను.

# ధన్యవాదాలు

అచిరకాలంలో అయిదుకోట్ల తెలుగు ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న మన ప్రియతమ ముఖ్యమంత్రి, నా చిరకాల మిత్రులు గౌ. శ్రీ జలగం వెంగళరావు గారు నా కోర్కెను మన్నించి నా "ఆలోచనా లోచనాలు" అంకితం స్వీకరించడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

తెలుగువారి చరిత్రలో కనీ వినీ యెరుగని రీతిని ప్రపంచ తెలుగు మహాసభలు ఈ సంవత్సరం ఉగాదినుంచి వారంరోజులు ఎంతో ఘనంగా జరిపి తెలుగువారి కీర్తి, ప్రతిష్ఠలను మనదేశంలోనేగాక, యావత్తు ప్రపంచంలో ఇనుమడింపజేసిన ఘనత మన ముఖ్యమంత్రికి దక్కింది భాషద్వారా తెలుగువారిలో భావ సమైక్యతను సాధించగలమనే దృఢ విశ్వాసంతో శ్రీ వెంగళరావుగారు అనేక కార్యక్రమాలు తలపెట్టడం ముదావహం.

రమారమి ముప్పై యేళ్ళనాడు రాజకీయ రంగంలో పెనుతుపానులా ప్రవేశించి నాజీలను తలపించే నాటి నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా కీ॥ శే॥ పూజ్య స్వామీ రామానంద తీర్థగారి నాయకత్వాన భారత స్వాతంత్ర్య సమర చరమ ఘట్టమైన హైదరాబాదు సంస్థాన ప్రజా మహోద్యమంలో ముఖ్యపాత్రను నిర్వహించిన వెంగళరావుగారి ధైర్యసాహసాలను, త్యాగ విరతిని, కార్యదీక్షను కడుసన్నిహితంగా చూపి ఉప్పొంగి పోయిన వారిలో నేనొకణ్ణి.

ఆనాటినుంచి ఈనాటివరకు 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు తాలూకా, జిల్లా స్థాయినుంచి రాష్ట్ర స్థాయివి నాయకత్వం చేపట్టి ప్రజల సమస్యలను క్షుణ్ణంగా అర్థం చేసుకుని, రాష్ట్ర సమైక్యతను కాపాడుతూ నిస్స్వార్థ సేవచేస్తున్న మన ముఖ్యమంత్రి మాకు మార్గదర్శి. దేశభక్తులు, స్వాతంత్ర్య యోధులు, ప్రజానాయకులైన శ్రీ వెంగళరావుగారి హయాంలో తెలుగుజాతి మూడు పువ్వులు ఆరు కాయలుగా విరాజిల్లగలదనడం నిర్వివాదాంశం.

"కొండంత బోధన కన్న
గోరంత సాధన మిన్న"

అన్నదే ఆయన సిద్ధాంతం. అట్టి మహా వ్యక్తికి స్నేహచిహ్నంగా ఈ కవితా సంపుటిని సమర్పించుకుంటున్నాను.

'ఆలోచనా లోచనాలు' లోని వివిధ కవితలను తమ పత్రికలలో ప్రముఖంగా ప్రచురించి నాయెడ తమకుగల ఆదరాభిమానములను వ్యక్తపరచిన వివిధ పత్రికల సంపాదకులకు, ప్రసారంచేసిన ఆకాశవాణికి నేను యెంతో ఋణపడి వున్నాను. పుస్తక రూపంగా ఈ కవితలను ప్రచురించడానికి అనుమతించిన, వారి ఔదార్యానికి కృతజ్ఞతలు.

ఇది తెలుగు సాంస్కృతిక సంవత్సరం. తెలుగు సంస్కృతి వికాసానికి ప్రతి తెలుగువాడు తన శక్తి కొలది కృషిచేయాలి. సమైక్యతను కాపాడాలి. తెలుగులోనే మాట్లాడుకుందాం. తెలుగులోనే వ్రాతాం. మన యువతరంవారికీ, బాలబాలికలకు మాతృభాషపై ఆసక్తిని పెంపొందింప జేతాం. తెలుగు వెలుగు దశదిశల వ్యాపింప జేతాం.

ఈ కవితా సంపుటికి సుందర ముఖచిత్రం రచించిన నా మిత్రులు ప్రఖ్యాత చిత్రకారులు, దర్శకులు శ్రీ బాపుగారు సర్వదా నాయెడ కనపరుస్తున్న అభిమానానికి కృతజ్ఞుడను. శుద్ధప్రతి సిద్ధం చేయడంలో తోడ్పడిన యువమిత్రుడు శ్రీ పి. ఎస్. గోపాలకృష్ణకు జేజేలు.

మద్రాసులోని క్రిక్రాఫ్ట్ ఆర్ట్స్ సంస్థ అధినేత శ్రీ M. V. S. శాస్త్రిగారు ఎంతో సుందరంగా ముఖచిత్రాన్ని అచ్చువేసి పెట్టారు. క్రాంతి ప్రెస్ యజమాని, ప్రముఖ రచయిత శ్రీ ధనికొండ హనుమంతరావుగారు సకాలంలో పుస్తకాన్ని మనోహరంగా అచ్చువేసి ఇచ్చారు. శాస్త్రిగారికీ, హనుమంతరావుగారికీ నా ధన్యవాదాలు

కావ్యాంకితోత్సవాన్ని ఎంతో వైభవంగా జరిపించిన నాయెద లోపలి యెద శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికీ, ఇతర మిత్రులకూ నా కృతజ్ఞతలు.

—దాశరథి

# అనుక్రమణిక

రేయికున్నవి వేయి కన్నులు,
పగటికున్నది ఒక్క కన్నే;
వెలుగురేడే కన్నుమూసిన
విశ్వమంతట వెలుగు సున్నే.

మెదడుకున్నవి వేయి కన్నులు,
మనసుకున్నది ఒక్క కన్నే;
హృదయమున ప్రణయమ్ము తొలగిన
బ్రదుకులోగల వెలుగు సున్నే.

—F. W. BOURDILLON

# ఆలోచనా లోచనాలు

చీకటి చీర కట్టుకుని
ఆకలి రైక తొడుక్కొని
శోకంతో కుమిలిపోతున్న లోక కన్యను
చెరపడుతున్నాడు కాల రాక్షసుడు

చుక్కలు చూస్తున్నాయి
నక్కలు కూస్తున్నాయి
ఆదుకోలేక అమాయక జీవులు
అడుగు వెనుక్కు వేస్తున్నాయి

నిరాశలు నిప్పుమంటలై రేగుతున్నాయి
దురాశలు దుందుభులై మోగుతున్నాయి
ఆశకు ఆయువు తీరిపోయిందా?
అవని అశాంతి యవనికలో దాగిపోయిందా?

ఇది కథకాదు, కాలుతున్న సొద
ఇది యెదలో సాగుతున్న రొద;
దీన్ని కలకాలం భరించలేం కద?
అందుకే సమరం సాగింతాం, పద!

చూపుల సెర్చిలైట్లకు అడ్డంగా
దాపురించిన ఈ అంధకార గంగ
ఆలోచనా లోచన కాంతిపథంలో
అదృశ్యమైపోతుంది ఒక్క క్షణంలో

ఈ భయంకర బాధామయ ధాత్రి
ఇక ప్రియంకరమౌతుంది ఈ రాత్రి;
వ్యాపిస్తున్నై నవకాంతి జ్వాలలు
అవి మానవతా మందార మాలలు!!

# వీధి మానిసి స్వీయ గాథ

ధగధగ మండే సూర్యగోళమును
తలపై నేనే మోయాలా?
జగతిని జలముల ముంచే జలదుని
సైతం నేనే మోయాలా?
తలపై అచ్ఛాదనయే లేని
తపసిని నేనే కావాలా?
రోడ్డు పక్కగా యెల్లకాలము
గొడ్డులాగ జీవించాలా?

పాదచారులు పయనంచేసే
పథమే అయినది నా యిల్లు
వానకు ఎండకు తడిసీ, యెండీ
బండవారినది నా ఒళ్లు
వీధి జీవితం, వ్యథా జీవితం
విషాద గాథా కలిత జీవితం
అశ్రుధారలో తడిసిన హృదయం
అనద బ్రతుకులకు ఐన దంకితం

చీకటియే నా శయ్యాసదనం,
జాబిలియే నా ప్రేయసి వదనం
తారల జరీబుటా పనిచేసిన
ధారాధర పటమే నా వసనం
నగ్నత నైచ్యమనే నాగరకులు
అగ్నికి చేలం కడతారా?
భగ్నజీవుల రుగ్నత చూచి
పకపకమంటూ నవ్వేరా?

కట్టుగుడ్డయే లేని వారికి
గుట్టూ రట్టూ ఎక్కడిది?
చింకి పాత నోచని జీవులకు
సిగ్గు ఎగ్గూ ఎందుకని?
సంస్కృతి పేరిట చచ్చు సమాజం
సవాలక్ష కథ లల్లింది
సభ్యత పేరిట తన గొప్పదనం
జగాన బాగా చాటింది.

వీధి మానిసీ! గడచులే నిసి!
బాధాతమమును విడనివ్వు
గుండెల కొండల చాటున దాగిన
నిండు సూర్యు నిటురానివ్వు
సుప్రభాత నవ సుప్రజా నటన
సూత్రధారివే ఇక నువ్వు
నువ్వూ నేనూ ఒకటైన నప్పుడు
రవ్వలు రాల్చును తొలి నవ్వు

# స్వాతంత్ర్య మాసం

స్వాతంత్ర్య మాస మిదిగో!
భరతాంబ హాస మిదిగో!
ఆసేతు శీతనగము
జనతా విలాస మిదిగో!

దుశ్శాసనుల గళాలు
నిశ్శబ్దమాయె నేడు,
స్వేచ్ఛానవార్క బింబం
వే వెల్గులొలికె నేడు;

పర శాసకుల పదాలు
సరిహద్దు దాటె నేడు,
ఈ దివ్యధాత్రి మరల
నా దేశమాయె నేడు,

మన బోసినోటి తాత
అని గెల్చుకొన్న వేళ,
అసి లేని సైనికాళి
ఖుసి చేసుకొన్న వేళ;

ఓ సామ్యవాద రమణీ!
ఓ సమసమాజ తరుణీ!
అసమానతా విధానం
ఇకనైన మాసిపోనీ!

నయనాల పానశాల
ప్రియమార తెరవవేల?
పథికాళి మరతువేల?
మధు వందజేయవేల?

వ్యత్యాస మున్నచోట
బ్రతుకంత ముళ్లబాట;
రక్తాన్ని పీల్చు ధని కే
ముక్తాపలాల మూటా?

దోచేటి స్వేచ్ఛ వలదు
దాచేటి స్వేచ్ఛ తగదు
పనిచేసి, ఫలిత మంతా
పదిమంది పంచుకొనుడు

ఆ మిల్లు నీది కాదు
ఈ ఇల్లు నాది కాదు
'కలవాడు', 'లేనివాడు'
అను మాట పనికిరాదు.

తిన తిండిలేని వాడు
కనిపించబోనివాడు
ఆర్జించుకున్న స్వేచ్ఛ
అసలైన స్వేచ్ఛ యగును.

# అణు గీతం

శాంతియుత ప్రయోజనాల కోసం అణువును బేదించిన
శాస్త్రజ్ఞులారా!
భారత కీర్తి దశదిశల వ్యాపిస్తుంటే
భయపడేవారి గగ్గోలు విన్నారా!

కత్తితో కుత్తుకలను మాత్రమే
ఉత్తరించ వచ్చుననే
చిత్త వృత్తి గలవారు
కత్తితో మెత్తని గులాబీల అంట్లు కట్టవచ్చుననీ,
కడుపులోని విషవ్రణాలను తొలగించ వచ్చునీ,
కడుతియ్యని మామిడిపండ్లు కోసుకు తినవచ్చునీ,
గ్రహించి సహనం వహించలేరు, పాపం!

అణుశక్తితో అద్రిని పడదోస్తాం,
అవని గర్భాన్ని విడదీస్తాం,
అనంత మరుభూముల్లో
అమృత వర్షం కురిపించి
అతిమనోహర సస్యాలను మొలిపిస్తాం;
ఎడారిలో గోదావరిని పరుగులు తీయించి
నడి యెండ కాలంలో పంటలు పండిస్తాం

అణువుతో ఔషధాలు
అణువుతో వింత రథాలు
అణువుతో అతినూతన పథాలు
అచిర కాలంలో కల్పిస్తాం

పిచ్చివాడు అణువును ఆయుధంగా వాడుతాడు
మంచివాడు అణువును నేస్తంగా మలచగలడు

# అధిక్షేపము - కవితానిక్షేపము

(ఫారసీ కవులలో మరపురానివాడు ఫిరదౌసీ. ఇతడు క్రీస్తుశకం పదవ శతాబ్దం వాడు. ఇతని పూర్తి పేరు అబుల్ ఖాసిం హసన్ ఫిరదౌసీ. అరవై వేల పద్యాలుగల ఇతని మహాకావ్యం 'షానామా' పర్షియన్ రాజుల ఇతిహాసం. అమరమైన ఈ కావ్యం విలువ తెలుసుకోలేని ఆనాటి రాజు సుల్తాన్ మహమూద్—ఫిరదౌసీని అవమానించాడు. ఆ అవమానం కవిని కవ్వించింది. అధిక్షేప కావ్య రచనకు ఉపక్రమింపజేసింది. అందులోని ఒక భాగమే ఈ కవిత.)

కాలగర్భాన చనిన భూపాలకులను
కలముతో బ్రతికించిన కవిని నేను,
ఏసువలె నేను వారి పేరెత్తి పిలువ
తమ సమాధుల వెడలిరి ధరణిపతులు.

వాత హతికిని కాలప్రవాహమునకు,
అగ్ని, వర్షపాతమునకు భగ్నములగు
సౌధములను నిర్మించు రాజన్యుతోడ
కావ్య నిర్మాత నిక పోల్చగా తరంబె!

నా మహాకావ్య సౌధ శృంగములపైన
గాలికిని వానకును అధికారమేది?
కాలమును కట్టి పడవేయ గలుగు శక్తి
నా కలాన కొసంగి యున్నాడు "ప్రభువు"

రాజు లోనుదాత్తత లేనిరోజు వచ్చె
స్వామిలోన నౌదార్యమ్ము చచ్చిపోయె
మౌక్తికమ్ము నొసగలేని శుక్తిలోన
శూన్యమే గాని, కనిపించు నన్యమెట్లు?

ముండ్ల తీవెకు ద్రాక్షలు మొలుచునొక్కొ!
జముడు పొదలోన పండునే జామపండ్లు?
నాక వన వాటికలలోన నాటగానె
పాప భూరుహములు పుణ్యఫలము లిడునె?

పరిమళ ద్రవ్యముల నమ్మువాని చేర
పరిమళమ్మంటి తీరు నీ వస్త్రములకు,
బొగ్గులమ్మెడి వానితో పొందుసేయ
వసనముల నిండ నిండును మసియొకండె

చిరుతపులి మచ్చ లెవ్వరు చెఱుప గలరు?
వీగ్గు నెవ్వరు తెలుపు గావింపగలరు?
క్షుద్రుడగు వాని గుండెల ముద్రవడిన
హీనతను మాపజాలు టెవ్వాని తరము?

పులిని నను నీవు మేకగా తలచినావు
ఏనుగులతోడ తొక్కింప నెంచినావు
జ్ఞానకాంతుల వెదజల్లజాలు నేను
మానవున కెవ్వనికి లొంగబోను లెమ్ము!

అరువది వేల పద్దెముల నల్లిన కావ్యము, మౌక్తికస్రజ,
మ్మరయ ధరిత్రి శాశ్వతత నందవలెన్ కవితా మహత్తుతో;
పరపతి కంకితంబగుట న్యాయముకాదు., "ప్రవక్త" పాద పం
కరుహములందు నిల్పితిని కానుకగా, భవభంజకమ్ముగా

## "సౌందర్యాధి దేవత"

### (షాఃనామా నుండి)

యవనికాభ్యంతరమ్మున యువతి మోము
భాను బింబమ్ముకన్నను భాసురమ్ము
కొమ్మ, సొగసైన యేన్గుదంతమ్ము బొమ్మ!
తరుణి తనువల్లి మహిత మందారవల్లి

నెలత బుగ్గలు లేత దానిమ్మ పూలు
ఆమె పెదవులు జ్వలియించు అగ్ని శిఖలు
పడతి చనుదోయి రజత కుంభమ్ము లౌర!
కనులు కాటుకపిట్ట రెక్కలను బోలు

ఆమె మైతావి కస్తూరి నతిశయించు
గొలుసు గొలుసులు గొలుసులు వెలది కురులు
కాంత పదివ్రేళ్లు పది వెండి కలము లౌర!
ఎవరి ఫాలాన నేమి లిఖించ గలవొ!

చందమామపై కస్తూరి చల్లినపుడు
ఎవ్వరైనను చూచిరో! యే నెఱుంగ,
నా చెలియ మోముపై వ్రాలి నాట్యమాడు
నీలి కురులను చూడ రారేల మీరు?

# జ్వాలా నికుంజం

ఈ అగ్ని పుష్పాల షామియానాలో
ఈ అనేక బంభరాల సంగీతాలతో
ఎవ్వరి ఆనంద కమనీయ కన్యకు
ఇంత వైభవంగా పెళ్ళి జరుపుతున్నారు అహ్లాదంతో?

అనుక్షణం పయనించే ఈ కాలం
క్షణంపాటు ఆగి చూస్తోంది ఈ కోలాహలం;
అవును, ఇవాళ లోకం కొత్త కోక కట్టింది
ఇవాళ అమృతంగా మారింది హాలాహలం

ఇల్లు లేని నాకూ నీకూ ఈ మోదుగు కొమ్మ నీడ,
కొల్లలుగా డబ్బున్నా కట్టించలేని రతనాల మేడ!
ఈ కొమ్మ కింద వింత భంగిమలో నుంచున్న ఓ కొమ్మా!
జీవితాంతం ఇలా ఉండిపోనీ నన్ను నీ తోడ

మన అతిదిగా వచ్చిన ఈ ఆనంద వసంతం
మనలో కలిగించే భావనలు అనంతం
హింసా, రక్తపాతం ఇంకా జరుగుతున్నా
ఎన్నటికైనా అవుతుంది ఈ జగన్నాటకం సుఖాంతం.

# ఆత్మాన్వేషణ

నన్ను నేనే వెతుకుతున్నా నిన్నినాళ్లు
వలయు నాత్మాన్వేషణకు నీ రెండు కళ్లు,
పూలు పూచిన ఈ రసాల వనమ్ములో
నీ కళ్లు వెతికితి, కానబడె నీ రెండు కాళ్లు!

నీకు స్వాగతమో నవోదయ మోహినీ!
లోకమును మైకాన తేల్చే లోల దృఙ్మధువాహినీ,
మౌక్తికము కలకాల ముండదు శుక్తి గర్భములో
అందుకే వచ్చితివి నీవీ కంటకమ్ముల దారిని

నీ పదమ్ముల మ్రోయు మంజీరములు కోకిల గళములు
నీ పదధ్వని కర్థములు వ్రాయును కవీంద్రుల కలములు
నయనములకై వెదకులాడిన నాకు దొరికినవి
చేరదలచిన చోటు చేర్చెడి నీదు చరణములు

కనులు చూపకపోయినను నీ కరములైనా చూడనీ
కరములందలి చషక మొలికే మధువునైనా గ్రోలనీ
ధూళి ధూసరితాస్మదంఘ్రులు పానశాలకు తగవులే,
విశ్రమించని బాటసారిని, సుంత లోనికి చేరనీ

బాష్పముక్తాఫలములను నీ కొఱకు తెచ్చాను
ఊపిరుల దారాలతో హారాలు గుచ్చాను
నా రుధిరకణముల పద్మరాగము లున్న వెన్నో లక్షలు
వాని నీ పాదారుణిమకే కానుకగ ఇచ్చాను

అస్మ దన్వేషణములో బవదక్షులే తోడ్పడవలె
అక్షిసంకేతములతో నా సంశయములే విడవలె
నవ్యతకు నీరాజన మ్మిడు భవ్యమౌ నీ రాకతో
శిలలు విరులయి దశదిశల వికసించి సంబరపడవలె.

# తుషార క్రీడ

దివినుండి అవనికి
అవతరించిన హిమ యవనిక
జగన్నాటక రంగంపై
జరిగే వింత ఏకాంకిక.
బాలసూర్య కిరణాలను,
ప్రథమ సంధ్యా చరణాలను
అర్ధ నిమీలిత నయనాలకు
అద్దుకుంటూ వచ్చిన హిమకామిని,
పైన మాత్రమే కడు చల్లన
లోన విరహాగ్నివలె వెచ్చన

ఈ హేమంత సీమంతినీ
సీమంతంలో
సంక్రాంతి సిందూర రేఖతీర్చి,
సిగలో అంగార మందార
మంజరిని కూర్చి,
చల్లదనంలో వెచ్చదనం ఉందని
ఎల్లరికీ తెలిసే రీతిని
కావ్య వీణాతంత్రులనుండి
క్రాంతి వహ్ని కురిపించి
శీతవాత క్రకచానికి
కోతపడే హృదయానికి
అంగార ధానిక అందిస్తా
ఆనంద గీతిక వినిపిస్తా!

మంచు కుక్క కాటుకు
మనిషి చచ్చిపోవడమా!

సీతువు తీతువుకూతకు
జీవకోటి జడియడమా!

హిమవత్ పర్వతాన్ని
అగ్నిపర్వతం చేయగల
మహిమ నాలో ఉండగా
చైతన్యాన్ని జడం కానిస్తానా!

నేనే బోగిమంటను,
నేనే మానవతా దేవాలయంలో
అనుక్షణం మ్రోగే
కవోష్ణ కవితా ఘంటను,

ఈ ఘంటారావం వినపడినంతదూరం
కట్ట బట్టలేని, ఉండ ఇల్లులేని,
కటిక దరిద్ర మానవుడు
చలి దాడికి చావడు,

సాటి మనిషిని బ్రతికించుకోలేని
చచ్చు మనిషి బ్రతికి ఎందుకు?

ఈ తుషార యవనికను చించి
కృశాను కీలికగా రగిలించి
వజవజ వణికే అవ్వను
గజగజలాడే గువ్వను
రోగిని
బైరాగిని
నిరుపేదరాలిని
విశ్వశ్రామిక జనాళిని
కాపాడు కుంటాను
క్రాంతి గీతి పాడుకుంటాను
ఇది నా తుషార క్రీడ!
ఇది నా ఆశల రవ్వల మేడ!!

# వెలుగుల వంతెన

రెండు చీకటి కొండల మధ్య
నిండైన కాలప్రవాహం మీద
ఎవరు కట్టారీ వెలుగుల వంతెన?
ఎవరికి యాత్రికులపై ఇంతటి చింతన?

ఆ కొండలు కదలనే కదలవు
ఆ ప్రవాహం ఆగనే ఆగదు
ఈ వంతెనపై యాత్రిక బృందాలకు
రేయీ పగలూ అంతూ పంతూ ఉండదు.

ఈ వెలుగుల వంతెనను కూల్చాలని
ఈ యాత్రిక బృందాలను కాల్చాలని
ఎందరు విద్రోహులు ప్రయత్నించలేదు?
ఎందరు హంతకులు ఎత్తులు వేయలేదు?

చీకటి కొండలు మనని భయపెడతాయి
కాలప్రవాహం మనని జడిపిస్తుంది
అయినా ఈ వంతెన నాది, నాది
నా అనంత యానానికి పునాది.

క్రింద కాలప్రవాహం నిదురపోదు
పైన గల అనిశ్చితాకాశం కిందికి రాదు
రెండు తీరాలను కలిపే వెలుగుల వంతెన మీద
నాకు ఏ నాటికీ ఈ మోజు పోదు.

# అరుణ ప్రవాళ వల్లరి

అరుణ ప్రవాళ మేమంది?
తరుణుల రుధిరం తానంది
నిన్న జనించిన నూతన జాతికి
వెన్నెముక ప్రజాబలమంది

కాలసర్పము వేసిన కాటుకు
గడగడ లాడక నిలిచింది
ఎదురు దెబ్బ తీసింది
విజయం సాధించింది

ఏడున్నర కోట్ల జన హస్తాలలోన
ఏక నాడిగా కదిలింది
కర్రా, గొడ్డలి, పారా, పలుగు
కత్తి, తుపాకీ తానైంది.

తల్లీ పిల్లా ఇల్లూ వాకిలి
తలచినవాడే కనరాడు
స్వాతంత్ర్యాన్ని సాధించదలచే
సమరయోధుడే ప్రతివాడు

ప్రాకే అరుణ ప్రవాళ వల్లరి
'పాకీ' గొంతుకు ఉరితాడు,
బాంగ్లా సరిహద్దులలో ఆగదు
ప్రపంచమంతటు అది ప్రాకు

ఎక్కడ హింసా, దౌర్జన్యాలూ
ఎక్కడ బానిస బంధాలూ
ఎక్కడ దమనం, ఎక్కడ హననం
అక్కడ ఆ వల్లరి సిద్ధం

విప్లవ ప్రవాళ విజయ వల్లరి
ప్రజా శత్రువుల పాలిటి పెనుఉరి,
ప్రజల కోసమై ప్రాణాలొడ్డిన
వీరుల గళాల వికచ మంజరి

# వసంత గీతి

మసి పూసుకున్న
మనసు లున్న
మానిసుల నుండి విసిగిన నేను
మామిడి తోటలోకి వెళ్ళాను.
ప్రేముడి
కి పర్యాయ పదం మామిడి.
కాముడి
నాలుగవ బాణం మామిడి.
కోకిలకు చోటిచ్చిన రసాలం
కవికి చోటివ్వదనజాలం

మాట్లాడని మామిడితో
మాటలు సాగించాను
మూగి చెట్టుతో నేను
బాగా వాగించాను

నవ కవి మెచ్చేలాగా
నాలుగు పంక్తులు లాగించాను
"నరక బడిన తరువైనా
మరల మరల చిగురించును,
ఎండి యున్న చెరువైనా
నిండుగ విలసిల్లును
క్షీణించిన శశియైనా
చీకటి గల నిసియైనా
పండు వెన్నెలల సోనల
పరవశించి పోవును

నిసిలా
మానిసి కూడా
నిన్న మహా విషమైతే
నేడు మషీ రసమైతే
రేపు సుధా చషక మౌను"

నవ్వుతోంది మావి కొమ్మ కిలకిల
పాడుతోంది పాత పాట కోకిల;
ఈ గీతం మామిడి పాడింది కాదు
ఇందులో నేను కోరింది లేదు

"పాసిపోయిన ఆశా గీతం
పాడుపడిన దేవిడీలో భూతం,
మాకు అక్కరలేదీ పాట
మస్తిష్కంలో ముళ్ళబాట
పని చేయని పాత మీట,
మారిన కాలాన్ని గూర్చి
మామిడే పాడాలి
మైకంలో మైమరచి
మానిసి ఆడాలి."
మామిడి ఆవేశంతో
మండి పోయింది కవితలో—

"బాంబుల యుగంలో
అంబుల పొదితో
రణానికి వెళ్ళే వాడి వలె
జనానికి కోకిల పాట రుచించదు.
పాడండి ఆకలి పాట.

గవేషణలో ఆకలి,
ఆర్థిక వ్యత్యాసాలను
అంతమొందించాలనే ఆకలి—
బానిస మానిసిని
స్వతంత్రుణ్ణి చేయాలనే ఆకలి—
సామ్యవాదాన్ని తప్పుదారిలో తిప్పే
షండులనుండి, పాషండుల నుండి
జగాన్ని కాపాడాలనే ఆకలి

ఈ ఆకలి మంటలు
ఈ ఉగాది పంటలు."

ఆకలి పాట సాగిపోయింది
కోకిల పాట ఆగిపోయింది
గతవర్షాన్ని తినేసిన కాల కన్య
నవ వర్షాన్ని కనేసి పారిపోయింది.

# పరిణామ పర్వం

నయన శయనాగారం లోనుంచి
నడచి వస్తోంది నవ వర్షసుందరి;
హిమ చేలాంచలం ఎగిరిపోతుంటే
ఎంత పొంకంగా ఉంది ఆ మనోహరి!

ఆమె బుజాల గిరిశిఖరాల చాటునుంచి
అవతరిస్తున్నాడు నులివెచ్చని సూరీడు,
పిలుపు వినగానే, ఆమె కురుల తెరల్లో దాక్కొని
బిక్కుబిక్కుమని చూస్తున్నాడు, పిరికివాడు!

హృదయంలో పొంగే రుధిర పయోనిధి తరంగాలు
గగనంలో ఉన్నతోన్నతంగా ఎగసే ఊహావిహంగాలు,
నల్లబారిన ఈ లోకపు కోట గోడలకు
వెల్ల వేస్తున్నాయి పరిణామ కాంతికిరణాలు

ఇవాళ తొలిప్రొద్దు పాటలు పాడుకునే పవన బాలకులు
అవనినే నిద్రలేపగల ఆనంద వైతాళికులు,
ప్రతిపదంలో కదం త్రొక్కుతున్నాయి జ్వాలలు
అవి దీనప్రజాగళాలలో వైప్లవ్యమాలలు

నాడు కదలలేక గతం బరువుతో మూల్గుతున్న లేఖిని
నేడు గగనంనుంచి భువనందాకా ప్రవహించే చైతన్యవాహిని;
జనులను వరించి వచ్చింది జవరాలు జనవరి
జనతా జాగృతికి ఇది అనువైన తొలకరి

మారింది పోల్చుకోలేనంతగా కాలం ఈనాడు
మారనివాడు, మార్పు కోరనివాడు మనిషే కాడు;
నిశాచరుల గుండెల కొండల్లో డైనమైట్లు పేలాయి
ఉషస్తుషార జలధారలు ఇలాతలానికి దూకాయి.

# గజదంత గోపురం

గజదంత గోపురం
లో కాదు కాపురం,
కార్మికులు గల పురం
కవికి అంతఃపురం

పెద్ద పొగగొట్టాలు
పేదలకు చుట్టాలు,
ఆ ధూమ పటలాలు
బాధితుల నిటలాలు

వీధి పక్కన ఉనికి
విధిలేని ఆ మనికి;
తారురోడ్డే పాన్పు
నారి కచటనె కాన్పు

మరుగులేని జనాళి
ముదుగుకంపున కేళి;
చీర నోచని పడుచు
సిగ్గునెట్టుల మరచు?

బ్రతుకె అచ్చెరువాయె
మృతియె సహజమ్మాయె
మనిషి కేదీ సుఖము?
మషీమయమే ముఖము

హేమంత రాక్షసీ!
మా మీదనా కసి?
ఈ భోగిమంటలు
నీకు చితిమంటలు

సంక్రాంతి పొంగళ్లు
సమయించు కడగళ్లు;
నింగిలో యేముంది?
నేలపై మా యిళ్లు!

ఆకాశ సౌధాల
నిర్మాణ మింకేల?
గజదంత గోపురం
దిగుదాము అందరం.

# నా దేశం ఆ దేశం

మతం మరచి పోగలను
గతం విడిచి రాగలను
భారతీయుడను నేనని
పరవశించి పోగలను

పాతికేండ్ల స్వాతంత్ర్యం
జాతిని మార్చేసింది
ప్రపంచపటంలో మనకు
ప్రత్యేకత వచ్చింది

మతం పేరుతో బతికే
మనిషి ఓడిపోయాడు
నియంతగా నిక్కి నీల్గి
నీరుకారిపోయాడు

తూరుపులో కొత్తజాతి
తొంగితొంగి చూచింది ,
భరతజాతి జయపతాక
ధరణికి వెలుగుల రేక

ఇంతటితో తృప్తిలేదు
ఈ ప్రయాణ మాగిపోదు
క్షామ మంతరించాలి
సమృద్ధి సాధించాలి

నాదేశం ఆదేశం
నాకు మరపురాదు
"తిండీ, గుడ్డా, ఇల్లూ
ఉండనివా డుండరాదు"

చదువురానివా డుంటే
జాతికి అవమానము
ప్రతివాడూ చదివినపుడు
భరతజాతి గౌరవము

రుజనుండి, క్షుధనుండి
ప్రజలు ముక్తిపొందాలి
నిజమైన స్వాతంత్ర్యం
ప్రజ సంపాదించాలి

ప్రజాస్వామ్య పథంమీద
సామ్యవాద రథంమీద
స్వాతంత్ర్య కాహళి
పలికించును ప్రజావళి

# మళ్లీ మ్రోగిన మంజీరం

మహబూబ్-కీ- మెహెందీ నుంచి
మాయమైన మగువ
మళ్లీ కనిపించింది
ఇన్నాళ్లకు.

అర్ధ దశాబ్దంగా స్తబ్ధమై
నిశ్శబ్దమైన నిశా నిశాంతం
ఆమె మంజీర శబ్దానికి జలదరించింది

[1]"గుల్జార్" ఆమె అసలు పేరు
"బీదర్" ఆమె అసలు ఊరు
ఈనాడు ఆమె పేరు "చంబేలీ"[2]
ఆమె సంగీత నాట్యాల రంగేళీ

ఆమె అందెలకు బందీ లయ్యారు కొందరు
ఆమె అందానికి "వందే" అన్నారు కొందరు

ఆమె- అల్లరి గాలి ఆఘ్రాణించిన పుష్పం
ఆమె- స్త్రీత్వం జార్చిన నవరక్త బాష్పం

ఆమె- కవి కలంనుంచి దూకిన కమ్మని గజల్
ఆమె- ఎవ్వరూ విడదీయలేని పజిల్

ఆమె కొంటె నవ్వులో ఎంత విషాదం।
ఆమె కంటిచూపులో ఎంత ఆమోదం!

---

1. తోట. 2. మల్లె.

తమను తాము మోయలేని మార్వాడీలను
తమనే తాము నమ్మలేని రౌడీలను
రసికులను — అరసికులను
పధికులను రధికులను
క్రూరులను భీరులను
పరవశింపజేసే సజీవ యంత్రం ఆమె

అయినా ఆ యంత్రంలో
మనసు మంత్రముగ్ధులను చేసే తంత్రం ఉంది
అది ఆమె విసిరే చలోక్తి
అది కలిగిస్తుంది ఆమెపై అనురక్తి

మన ప్రతి ప్రశ్నకు ఆవిడ 'రిపార్టీ' ఒక పద్యం
ఆ పద్యం మనసు మైమరపించే మద్యం

"ఇన్నాళ్లు ఎక్కడ దాగి ఉన్నావు?"
"మీ జ్ఞాపకాల్లో మిగిలి ఉన్నాను."
"మళ్లీ ఇక్కడికెందుకొచ్చావు?"
"రమ్మని ఊసి కొలిపావు నీవు."
"నీలో ఆకర్షణ యెందుకు తగ్గలేదు?"
"కాలం నన్ను ఓడించలేదు."
"నీవు ప్రకాశిస్తా వెంతదాకా?"
"అంతులేని ఈ రేయి ఉన్నంతదాకా?"
"నువ్వు మా శాంతివా? మా భ్రాంతివా?"
"నేను మీ కళ్లలోని కాంతిని"

ఆ రిపార్టీ. ఆ తుక్ బందీ[3]
ఆమెలో ప్రత్యేకతగా నిలిచి ఉంది

---

3. సవాల్-జవాబ్ వంటి పద్యం.

అవి విన్న ప్రతివాడి హృదయం కదిలింది
సెగలు పొగలై ఆకాంక్ష రగిలింది

"రాం, రాం" అన్నాడొక హైందవేయుడు
"సలాం, సలాం" అన్నాడొక మహమ్మదీయుడు
"బై, బై" అన్నాడొక క్రైస్తవేయుడు
ఆమె క్రీగంటి చూపులకు ప్రతివాడూ విధేయుడు

చడీ చప్పుడూ లేని ఆ దేవిడీలో
ఆమె అడుగు పెట్టడంతో మళ్ళీ అలజడి,
అశాంతితో వచ్చే మనిషికి
ప్రశాంతి పంచుతుంది ఆ నర్తకి

అప్రూత పుష్పం!
అవిద్ధరత్నం!
ప్రిదిలిన హృదయాల
విశ్రాంతి సౌధం!

# ఐకమత్య గీతం

'నవంబరు ఒకటి' ఏమంటున్నది?
'నా తెలుగు జాతి ఒకటి'— అంటున్నది
ఎన్ని సమస్యల అమావాస్యలు ఎదురొచ్చినా
ఏకతా చంద్రోదయం ఎంతోసేపు ఆగదంటున్నది

అన్నలార! తమ్ములార!
ఆంధ్రజనని కన్నులార!

రెండు కళ్లు, చూపు ఒకటి
రెండు కాళ్లు, నడక ఒకటి
కలసి కూర్చుని మన మందరము
కలతలు తొలగించుకుందాము

కవులారా! గాయకులారా!
నా సంస్కృతి నాయకులారా!

మీరంతా కలాలెత్తి
మీరంతా గళాలొత్తి
ఐకమత్య శుభగీతం
విరచించండి, వినిపించండి

మనలో మనస్పర్ధ లేర్పడితే
మంజీరా నది బాధపడుతుంది;
కోపతాపాలు పెరిగిపోతే
గోదావరి కుమిలిపోతుంది;

నా కోసం నీ కోసం
నాగార్జునసాగరాన
ఆగిన కృష్ణావాహిని
ఆరాటపడుతుంది;

పంచకోటి ఆంధ్ర ప్రజలు
పంచప్రాణాలు ఆంధ్రమాతకు;
కలిసి కన్నీట మునిగి
కలిసి పన్నీట తేలి
కష్టసుఖాలు పంచుకుని
అష్టైశ్వర్యాలు పెంచుకుని
తెలుగు కీర్తి దశదిశల
వెలిగించాలి అన్నివేళల;——

కొత్త కిటికీలోనుంచి అవలోకించండి
కొత్త ప్రపంచాన్ని అర్థం చేసుకోండి ;
వింశతి మండలమండిత ఆంధ్రప్రదేశం
విశ్వజనాళికి అందించాలి ఏకతా సందేశం

# పూల లోగిలి
# ముళ్ల కౌగిలి

గడియారం కంటిలో
నడిరేయి ఫాల్గుణం ఆఖరురోజు, రెండుముళ్లు
కౌగలించుకోగా జలదరిస్తుంది ఒళ్లు ;
అయితే అంతటితో ఖతంకాలేదు
పాత వత్సరపు కడగళ్లు
తొలినెల ప్రతిపత్తిథి ప్రభాతకిరణం తాళంచెవి చప్పుడు
నవ వత్సరసౌధ కవాటాన్ని తెరచినప్పుడు
చేతిలో వేపప్రసాదపు వెండిగిన్నెతో
జారిపోతున్న పట్టు పైట మిసిమి వన్నెతో
ఉదయానిలానికి ఆడుతున్న అలకలతో
ఒయ్యారం ఒలకబోసే నడకలతో
ఉగాది తెలుగు జవ్వని వచ్చింది
తొలి చూపులోనే లోకానికి నచ్చింది

ఆంధ్రజాతికి పట్టిన శని
ఈ యేడైనా వదిలి పోయిందని
ఈ ఉగాది అంటున్నది ;
హాయిలేని కోయిల పాట
పళ్లు లేని మామిడితోట;
ప్రశాంతిలేని వసంత వనవాటి
బాధపడిపోతుంది తీక్ష్ణాతపంతోటి

తన సమస్యల్ని తాను పరిష్కరించుకుని
తన యింటిని తాను చక్కపెట్టుకుని
జాతి జీవిత సమరంలో గెలుస్తాడు
జయపతాకం ఎగరేస్తాడు తెలుగువాడు

కుళ్లు రాజకీయాల ముళ్ల కౌగిలి
సడలి తెలుగుజాతి అవుతుంది పూలలోగిలి

# మధుతోరణం

పోతున్నది పాత యుగం — పోనీ, పోనీ
వస్తున్నది కొత్త తరం — రానీ, రానీ
దిసమొలలై ఉన్న లతా విసరమ్ములకు
కుసుమాలే వసనావళి కానీ, కానీ

నైరాశ్యం అలముకునే నర హృదయంలో
నవ తిమిరం పరచుకునే గిరి వదనంలో
తరుణారుణ దావానల కీలావళులు
చెలరేగుట బింబించును నవ కవనంలో

పరిణామం తప్పదనే కోయిల పాట
విరబూయుట సహజమనే మామిడి తోట
వద్దన్నా, కద్దన్నా, ఎవరేమన్నా
వినిపించును, కనిపించును మన కేలేట

మండిపడే జండాతో ఒక పాలాశం
గింజుకునే గుండెలలో ఒక ఆవేశం
ఉల్లోలం, కల్లోలం ఉండే రీతి
ఉల్లేఖించాలనులే కవి ఆదేశం

పొరపాట్లను చేస్తుందీ నవ యౌవనము
రహదారిన పోతుందీ నవ జీవనము
ఈ తరము, ఈ జనము కోరే దేమో
తెలుసుకునే తలపుంటే అదె సద్గుణము

మరుభూముల వెలయాలీ నవ నందనము
శ్రమజీవులు పొందాలీ అభినందనము
సమవాదం మన వేదం కావాలంటే
జనులందున రావాలీ పరివర్తనము

అనురాగపు విరజాజులు విలసిల్లాలి
హృదయంలో సౌగంధ్యం వెదజల్లాలి
మధుమాస ప్రథమోదయ మంగళ వేళ
సౌహార్దపు విరితేనెల జల్లు పడాలి

# అంతర్దర్శనం

ఈ కొమ్మలు
అజంతా బొమ్మలు

వీరు అందాల రాసులు
లలిత కళలకు దాసానుదాసులు

ఇతరులను కవ్విస్తారు వీరు
తాము కవ్వింపుల పాలు కారు

మనసు మందాకిని
తనువు మృణాళిని

వీరు పాలరాతి విగ్రహాలు
వీరినుండి నేర్చుకోవాలి నిగ్రహాలు

వీళ్ల కళ్లలో యెంత కాంతి!
వీళ్ల ముఖాలలో యెంత శాంతి!

నిద్రనూ, సుఖాన్నీ విస్మరించి
నేర్చుకుంటున్నారు విద్యా విపంచి.

మదనుణ్ణి
అతి దీన వదనుణ్ణి
చేసి నిలబెట్టారు ఈ పిల్లలు,
మదనబాణాలు వీరికి చీపురుపుల్లలు!

బులిపింపులకు లొంగరు
జడిపింపులకు క్రుంగరు
వీరి చిరునవ్వు అందరికీ సమాధానం
చిలిపివాళ్లకు శిక్ష, వీరి మౌనం

ఇరవయ్యో శతాబ్దంలో ఇలాటి పిల్లలుంటారా?
ఎందుకుండరు? నేను చూశాను కళ్లారా?
ఎవరికివారే నిజానికి ఆదర్శం
అందరికీ కావలసింది అంతర్దర్శనం

# కొవ్వువత్తి - ద్రాక్షగుత్తి

[ఉపజ్ఞకు, కల్పనా పటిమకు, ఉక్తి వైచిత్రికి పదకొండవ శతాబ్దపు ఫారసీ కవి "మనొచెహ్రీ"ది అగ్రతాంబూలం. ఈయన పూర్తి పేరు అబుల్ నజ్మ్ అహ్మద్ మనొచెహ్రీ. ఇతడు దామ్‌గాన్ వాస్తవ్యుడు. గాజా రాజు సుల్తాన్ మసూద్‌కు ఇతడు ఆస్థానకవి. ఈయన రెండు కవితలకు ఈ రచన అనుసరణ]

## 1. కొవ్వువత్తి

ప్రాణ జ్వాలిక ఫాలభాగమున విభ్రాజిల్లుచుండంగ ని
ద్రాణంబైన ధరాతలంబునకు చైతన్య ప్రభా పుంజముల్
దానం బీయగ జాలు తైజస పదార్థంబీవు; నీకన్న నా
కేనా డెవ్వరులేరు మిత్రులు, శుభాంగీ! కాంతి కాంతామణీ!

పైన దుస్తులు ధరియించు, మానవుండు,
లోన [1]దుస్తులు ధరియించు దాన వీవు,
లోన జ్వాలను భరియించు మానవుండు,
పైన జ్వాలను భరియించు దాన వీవు!

నీవు తారవే కాకున్న ఈ విభావ
రీ పథమ్ముల నేల వరించినావు?
నీవు ప్రేమైక జీవివై నెగడ కున్న
మీటెద వదేల సతము కన్నీటి వీణ?

నీవు వాతూల హతి మరణించి నపుడు
అగ్ని సంస్కారమే నీకు అసువు లొసగు,
జబ్బుతో నీవు కుమిలెడి సమయ మందు
నీదు తల నుత్తరించుటే నీకు మందు

1. వత్తి.

పూల కారే రాక పుష్పింతు వీవు
శిశిర ఋతువే లేక క్షీణింతు వీవు
అక్షులే లేకుండ అశ్రు లోడ్చెదవు
ఆస్యమే లేకుండ హసియించ గలవు.

నిసిని నిద్దుర పోవుటెంతొ సహజంబు;
కాని, విరహిని నేను, నీ కరణి నెపుడు
జాగరణ చేయుచుందును శర్వరులను,
పగలు పవళింతు నీవలె సెగలు మాని

నిన్ను విడనాడి ఒంటిగా నున్న యపుడు
భాస్కరున కేను పగవాని భాతి నుందు,
నీవు నే నేకమైయున్న తావులందు
కాళరాత్రికి కడు నేస్తగాడ నగుదు

నవ్వెదవు నీవు, నేనును నవ్వుకొందు,
కరగి పోయెద వీవు, నే కరగి పోదు,
పాలి పోదువు నీవు, నే పాలి పోదు,
కాలి పోదువు నీవు, నే కాలి పోదు

నా హృదయమందు భగ్గుమన్న దొక జ్వాల,
దాని నీతలపై గాంచినాను నేను,
నీవు తలదాల్చి నట్టి అగ్నికి మదీయ
హృదయమే పుట్టినిల్లని యెఱుగుమోయి!

నీ రమణీయమౌ ముఖము, నిర్మలమై కనువిచ్చు పచ్చ గ
న్నేరు విధాన నున్నది వనీ సుమవాటికలో;—మదీయ ని
స్సార ముఖమ్ము గ్రీష్మ దివసమ్ముల నెండకు వాడిపోవు గ
న్నేరు విధాన నున్నయది—నీకును నాకును సామ్యమున్నదే

ఎందరు మిత్రులన్ గలిగి యేమి ప్రయోజనమోయి నాకు? వా
రందరిలోన నిక్కమగునట్టి సఖుండొకండైనలేడు; నా
డెందము నందు నెప్పుడు నటించెడు నిక్కపు నేస్తమీవె, నా
బందుగు నీవె; నిన్ను విడువన్, నను వీడవు నీవు, నెచ్చెలీ!

## 2. ద్రాక్షగుత్తి

కస్తూరి వన్నెగల కాంతవలె నుండు
నెంతో విసీలమ్ము ఈ ద్రాక్షపండు,
సుదతి లోపల మూడు [2]హృదయాలు గలవు
పడతిలో నున్నది ప్రాణమ్ము ఒకటె!

అసువులకు రంగుండు ననుట నే నెఱుంగ,
ద్రాక్ష ప్రాణము గంగరావి పూ రంగు
ప్రాణమ్మునకు లేదు పరిమళమ్మెపుడు
కస్తూరి వాసన కలదు గోస్తనికి

ఇపుడె ఈడేరిన ఈ కన్నెపిల్ల
గర్భమ్ము దాల్చెను కాంతుడే లేక,
శ్వాస వలననె గర్భవతి యయ్యె 'మేరి'
అది గూడ లేక ఈయమ చూలు దాల్చె!

రమణి మేరీమాత ప్రసవించె శిశువును
చెలియ ద్రాక్షాలత చిందించె మధువును,
ఆ శిశువు కీస్తుగా అవతరించాడు
సృష్టికర్తకు ఆత్మ రీతి నున్నాడు

---

2. గింజలు.

ఈ మధువు మేధావు లెల్లరి సృష్టికి
కర్తయై లోకాల వర్తించె నేడు,
ఏసును బంధించి యెంతొ హింసించి
తుదకు వధియించిరి హృదయాలు బెదర,

ద్రాక్షను ఛేదించి, దాని మర్దించి
ఆసవము చేసిరి అసువులు తీసి,
జీస సాక రిద్దరిని జీవింప జేసె,
మధువు విశ్వమ్మునే మరల బ్రతికించె!

యూదు లాతని నంత మొందింప దలచగా
జగమెల్ల ద్రాక్షను తెగటార్చ దలచును
అయిన నేమాయె! క్రీస్తమరుడైనాడు
అయిన నేమాయె! ద్రాక్షాసవము నిలిచె

శిక్ష పొందిన క్రీస్తు రక్షకుం డైనాడు
శిక్షనందిన ద్రాక్ష సేవింప బడె నేడు,
యేసు ప్రభు వుండేది ఆ సురాలయములో,
ద్రాక్ష రసముండేది రారాజు కరములో.

## జ్ఞాన వల్లరి
## (గజల్)

అవని సృష్టికి ఆది ఎచ్చట
అంత మెచ్చట? తెలియదు!
నేను ఎచ్చటినుండి వచ్చితి?
ఎచటి కేగుదు? తెలియదు!

దైవమునకే తెలియునందురు
దైవభక్తులు అందరు!
ఈ ప్రపంచం ఉనికి ఎందుకొ
ఎవ్వరికినీ తెలియదు!

సుందరాంగి ముఖముపై
ముసుగెందుకో నే నెరుగుదు;
అంతకంటే ఇతర
వేదాంతాంశ మేదీ తెలియదు

నాకు వేదన నొసగె నెవడో?
అతడు మిత్రుడొ? శత్రువో?
దీని వాస్తవ మేమిటో
ఏనాటికైనా తెలియదు

తనను గూరిచి తానె ఇంచుక
తెలుసుకొన లేడాయెనే!
అట్టితరి ఇంకొకరి గూరిచి
ఎట్లు తెలియును? తెలియదు!

అడుగు అడుగుకు, గడప గడపకు
ఆగిపోయే నడకతో
ఎంతదూరం ఎంతకాలం
ఎవడు నడుచునో? తెలియదు

ఎన్ని కొలమానములు కలిగిన
ఏమి లాభం లేదులే!
ఎంతవానికి తనదు గమ్యం
ఎంత దూరమో! తెలియదు

నాకు మృత్యువు పైననే
ఏనాటికైనా నమ్మకం!
నా రుజా పటలమ్ము మాపెడి
దారి మిత్తికె తెలియును.

(ఉర్దూ మూలం: జోష్ మలిహాబాదీ)

# మంగళాచరణం

లక్షల మందిని
కుక్షిన పెట్టుకున్న వియత్నాం యుద్ధం
పన్నెండేండ్ల పిమ్మట
పరిసమాప్తి అవుతోం దంటున్నారు.

ఈ మారణ హోమంలో
పసిపాపలు, పడతులు
యువకులు, వృద్ధులు
రైతులు, కార్మికులు
విద్యార్థులు, విద్వాంసులు
ఎంద రెందరు హతులైనారో!

రక్తంతోపాటు కన్నీరు
కన్నీటితోపాటు రక్తం
కలగలిసి కాలువలు కట్టలేదా?

మృత్యువు
అనునిత్యం
వాడవాడలా
తాండవించలేదా?

తమవారిని కోల్పోయి
తపించే దౌర్భాగ్యుల
తపన విన్న వారెవ్వరు?

బాంబుల భీకర శబ్దాలు విని
పువ్వు పూయడానికి భయపడింది

పసిపాప నవ్వడానికి జడిసింది
పక్షి ఆకాశంలో విచ్చలవిడిగా
పల్లటీలు కొట్టడానికి జంకింది

సెలయేరు గిలగిల లాడింది
సముద్రం వేదనతో మోషించింది
మనిషిని మనిషి హతమార్చిన
మారణ హోమాన్ని చూసి
సూరీడు తలవంచుకున్నాడు

పొలాల్లో పంటలకు బదులు
ఫిరంగీగుండ్ల నిండిపోయాయి

ఇకనైనా వియత్నాంలో
ఇల్లాలు పిల్లల్ని తన ఒడిలో
పడుకోబెట్టుకుని
ప్రశాంతంగా నిదురిస్తుందా?

ఇకనైనా ఆకాశంలో
యుద్ధ విమానాలకు బదులు
చల్లని వర్షామేఘాలు
మల్లెలు వెదజల్లేనా?

నర్తకి తన కాలి అందె కదలించేనా?
పెదవులకు విషం కాక
మధుబిందువు లందేనా?

మానవలోకానికి
మంగళం కలిగేనా?

# మధుజ్వాల

పట్టికుండలు దొరలుతున్నవి
ఒక్కమూలన! డొక్కలుత్తవి;

నిండు కుండలు నీల్గుతున్నవి
నిద్రమత్తున ఒక్కమూలన!

ఎంత న్యాయం ఉన్నదే? ఈ
విభజనంలో ఓ ప్రియా!
ఎంత ధర్మం ఉన్నదే ఈ
పంపకంలో ఓ ప్రియా!

పానశాలను హెచ్చుతచ్చుల
బాధలే లేవందురే!
అందరిని ఒక రీతి చూచెడి
బంధువవు నీ వందురే!

ఒక్కరిని క్రీగంట చూతువు,
ఒకరిగుండెల బాణమేతువు
ఒకరిమాటే యెత్తబో, విం
కొకరిమెచ్చవు, ఏమిహేతువు?

ఇంట మాధ్వీకమే లేదని
ఇక్కడికి రాలేదులే?
నీవొసంగే ఒక్క బిందువు
నిజంగా అది అమృత సింధువు!

నిన్ను గాంచిన నిషాలో పడి
గిన్నె ఖాళీకాదుతే
ఉన్న మధువును తీసుకో, నీ
కన్ను నాపై వేసుకో!

తాగి వాగెద ననుకునేవు
తాగనపుడే వాగెద,
తాగగానే పానగోష్ఠిని
మూగనై నే నుండెద

బాల అందించిన మధువులో
జ్వాల యేదో ఉన్నది!
గళములో అది చేరగానే
కలము పరుగిడుతున్నది.

# సూర్యానువర్తిని

చీకటి గుండెలను
చీల్చే కిరణాల ఛురికలతో
లోకంలోకి దూకే
లోక బాంధవుని నయనాల్లోకి
తదేక దీక్షగా చూసే
తన్వీ! సూర్యముఖీ!

ప్రథమ సంధ్యా సమయాన ప్రాగ్దిశవైపు
చరమ సంధ్యావేళలో పశ్చిమం వైపు
చూపులు సారించే నీ చక్కని రూపం
ఇలకు దిగి వచ్చిన ఇంద్ర చాపం

నీవు విరిసినప్పు డీ నలుపు తెలుపు నేల
నిండుగా రంగుల చిత్రంలా నిగనిగలాడు నేల?
నేలకూ సూర్యుడికీ గల చుట్టరికం
నీలోన మరింతగా సాక్షాత్కారం

కన్నుల పండువైన నీ ఒయ్యారం
కవి కలానికి కళాకారుడి కుంచెకు ఆహారం;
గాలి తరగలు నిన్ను కౌగిలించుకుని ఒళ్లు మరిస్తే—
కోట్ల మైళ్ళ దూరాన గల సూర్యుడు తన
కోమల కిరణాల కొనలతో నిన్ను చుంబిస్తే—
నీవు నా కవితాముకురంలో కమనీయంగా బింబిస్తే
జీవితపు వెండితెరమీద ఆడే నీ రంగులబొమ్మ
స్వప్నాల వనవాటికలో ఫలించిన రసాలపు కొమ్మ

భవదీయ బీజావళి విరాజమాన తైలధార
ప్రజారుజాగ్రస్త హృదయాలకు అమృతధార
అస్మదీయ నయనాలకు కవనాలు నేర్పిన నీ సుందరరూపం
అర్కుడు అవనిపై వెలిగించిన అనురాగ దీపం.

# ఎర్రటి నవ్వులు

ఇవి వాసన లేని పువ్వులు కావు
ఇవి వెలుతురు లేని దివ్వెలుకావు,
ఇవి రంగుల గాజు రవ్వలు అసలే కావు;
ఇవి వ్యధిత జనావళి రుధిరాధరముల
చివురించిన యెర్రటి నవ్వులు

పయోధరాగ్రములమీద
బాలచంద్రరేఖవంటి
వక్రమనోహరములైన
నఖక్షతా లసలేకావు

దొంగ సన్యాసులు వేసుకున్న
దోరకావి కుబుసాల్లో
దోబూచులాడే సంధ్యారుణ
ద్యుతులు కావు ఈ నవ్వులు

ప్రబంధాలలో చదువుకుని
పదేపదే కలలు కనే—
ప్రభువుల మకుటాలలోని
పద్మరాగమణులు కావు

కంబోడియా కదనంలో
వియత్నాం విలయంలో
బాంగ్లాదేశ్ సమరంలో
పోరు సలిపి చనిపోయిన
వీరుల హృత్కమలా లివి

శ్రమజీవుల మేలెంచి
దమననీతి నెదిరించి
అనుక్షణం పోరాడే
అనేక యువ నాయకులు
ఆకసాన యెగరేసిన
విప్లవ నవ పతాక లివి,
విజయానికి రాక లివి.

# భద్రతలేని పట్టభద్రుడు

భద్రత లేని పట్టభద్రుడు
'శాంతి, సహనం' అర్థం తెలియని
భగభగ మండే ఆకలి మంటకు
నకనకలాడే నవయుగ రుద్రుడు

అతని చదువుకై ఇల్లూ వాకిలి
అమ్మిన అమ్మా నాన్నలకు
పట్టెడు అన్నం పెట్టగలేని
పరమ దరిద్రుడు పట్టభద్రుడు

ప్రజాస్వామ్యమని సామ్యవాదమని
వల్లిస్తేనే చాలదు
వాగ్దానాల్తో నినాదాలతో
స్వర్గం నేలకు వాలదు

అస్తవ్యస్త ఆర్థిక వ్యవస్థ
మారకపోతే మనిషికి అవస్థ
ఆపదలేమో అందరికా?
సంపదలేమో కొందరికా?

సామ్యవాద సాధనకోసం
శ్రామికవర్గం కదలాలి
యువతీయువకులు ఈ సమరంలో
నవనాయకులై నిలవాలి

వర్గబేధము, నిరుద్యోగము
పరపీడనము పోవాలి
ధనస్వామ్యము ముర్దాబాద్!
జనస్వామ్యమే జిందాబాద్!

# గుల్ మొహర్
# కుసుమాంజలి

విరగబూసిన గుల్‌మొహర్‌లో
అరుణ చేలాంచలము లెన్నో!
అరుణ చేలాంచలము నీడల
గుల్‌మొహర్ కుసుమమ్ము లెన్నో!

చరమ సంధ్యా గగన భాగము
ధరణికే దిగి వచ్చె ననగా
అగ్నిపర్వత ముఖజ్వాలలు
నగ్నముగ నర్తించెననగా—

శ్రమిక సేనావాహినులు తమ
జయపతాకలు విసరెననగా,
అంగడుల కుంకుమల రాసులు
ఆకసానికి తాకెననగా—

భాగ్యనగర గృహాంగణమ్ముల
పరచుకొన్నది గుల్‌మొహర్,
నవ వసంత విభాతవేళల
నవ్వుతున్నది గుల్‌మొహర్.

ప్రతి క్షణమూ విజృంభించే
వక్షములపై, పికిలిపోయే
జవ్వనుల కాశ్మీరకంచుక
సదృశమైనది గుల్‌మొహర్.

గాయపడిన కవీంద్రు గుండెల
కదలు విప్లవ భావములవలె
ఎండకాలపు రాత్రులందున
మండిపోయెడు గహనములవలె—

ఆదిశేష సహస్ర ఫణముల
అందగించెడి పద్మరాగము
తెల్లదెసల వెలార్చు రోచిస్
తల్లజము వలె గుల్‌మొహర్.

దేశరక్షణ కసువులొడ్డిన
ధీరసైనిక చితాజ్వాలల
మాలలై, నీలాంబరమ్మున
తేలియాడెను గుల్‌మొహర్.

## మిథ్యాగామి రథ్య

నేను మెచ్చింది రంభ
నేను మునిగింది గంగ

నాకు నచ్చింది నీతి
నాకు నచ్చనిది అవినీతి

అంతేలేని ఇంతటి మహాప్రపంచంలో
నాకు ముఖ్యం నే నొక్కడినే

నేనే నాకు కేంద్ర బిందువును,
నేనే సూర్యుణ్ణి,
నా కోరికలు నా చుట్టూ తిరిగే గోళాలు

నన్ను కేంద్రముగా చేసుకుని
నేను విశ్వమంతటా విస్తరించాలని చూస్తాను

అప్పుడు నా శక్తి మధ్యాధ్గామి;
బిందువు నుంచి మహా వలయందాకా
వెళ్లుతాను;

ఆ వలయానికి ఆది లేదు అంతం లేదు;
ఆ వలయంలో తిరిగి తిరిగి
నా కాళ్ళు అరిగి అరిగి
నా కళ్ళు కరిగి కరిగి
నిరాశతో నిస్పృహతో
వలయావరణం. నుంచి
మధ్య బిందువు వైపు పయనిస్తాను;

అప్పుడు నేను మధ్యగామిని;
దురాశతో దూర వలయాన్ని
అందుకోడానికి వెళ్ళిన మధ్యాధ్గామిని నేనే;

అనంత వలయంలో తిరిగి తిరిగి
తిరోగమించి వచ్చిన మధ్యగామినీ నేనే,
నిజానికి నేను మిథ్యాగామిని,
నా రథ్య నా చుట్టే!
ఆ వలయం ఒక ప్రళయం.

# సుస్వాగత శుభగీతం

ఇంకా నుంచున్నారేం?

ఇగురించే తరులారా!
విరబూసే లతలారా!

స్వాగత సేవ తోరణాలు
జగమంతటా కట్టండి

వన వనాంతరములలోన
వసంతాలు నింపండి

ఇంకా మాట్లాడరేం?

పికములార! శుకములార!
లోకాలే పరవశింప
శ్రీకర గీతాలు పాడి
జీవుల మేల్కొల్పండి
నవశకాది వస్తున్నది

ఇంకా చూస్తున్నారేం?

ఇందీవర నయనలార!
కుంకుమ వెదజల్లండి
పసుపు పంచిపెట్టండి
ప్రసూనాలు పరచండి
వస్తున్నది నా ఉగాది
నవజగతికి తొలి పునాది

ఈ దారినె వస్తున్నది
ఈ దారినె వస్తున్నది

సత్యము సుందరము శివము
సకల కళా మనోహరము
తెలుగులపాలిటి వరము
ఇలకుదిగిన సురపురము
జనహర్షము నవవర్షము
అదిగదిగో! వస్తున్నది!

జనులారా! స్నేహామృత
ధనులారా! ఆనంద త
రుణులారా! మంజీర చ
రణులారా! ప్రణయ మణీ
ఖనులారా! మనులారా!
అచ్చరవలె అరుదెంచెను
వెచ్చని పచ్చని ఉగాది!

సుస్వాగత శుభగీతం
పాడుట మన కర్తవ్యం

# హర్షపాతం

కురుస్తున్నది కుండపోతగా వాన
విరుస్తున్నది పరమానందం హృదయాన,
అన్నమో రామచంద్రా అని
అలమటించే మనదేశపు
బీటలు వారిన పెదవుల వెంట
నీటిబిందువుల చిందులాట

ఆకాశంలో నడయాడే మేఘాల వెంబడి
అనుగమించాలని ఆశించే చాతకాన్నై
ఆంధ్రుల అదృష్ట జాతకాన్నై—
క్షామగ్రస్త భూమాతకు కాస్త ఊరట కలిగించే,
గ్రామ గ్రామాన పచ్చని పచ్చిక వెలయించే
వానదేవుడికి కృతజ్ఞత తెలపాలి—
మానవాది సకల ప్రాణులకు మనశ్శాంతి కలగాలి.

ఎంతటి బలమైన నాగలినైనా
ఎలాటి కఠినమైన నేలలోనైనా
అవలీలగా లాగగల గిత్తల జత
అశ్రువులతో చెబుతూంది ఆకలి కత

సేరు బియ్యపు అన్నం బోంచేసి
చెమటోడ్చి రేబవలు కష్టంచేసి
కండలు తిరిగిన కర్షకుడు
నేడు ఎండిపోయిన బొమికల గూడు

పిల్లాపాపలతో కళకళలాడే ఇల్లాలు
బిచ్చపు చిప్పతో తిరుగుతూంది ఇల్లిల్లు;
నలుగురికి అన్నం పెట్టగల గృహస్థు
నాలుగు నాళ్ళనుంచి కటిక పస్తు.

చాలీచాలని జీతపు గుమాస్తా
ఆకలిని మరచి తనతో ఉంటున్నందుకు
అలమటిస్తూంది చౌరస్తా

ఇది మానవుని దానవుని చేసే క్షుధ
ఎదలో బీభత్సం రగిలించే వ్యథ!

శాస్త్రజ్ఞుడు అసహాయుడై ఆకసంవైపు చూస్తాడు,
సమయానికి జలధరాన్ని పిలిపించి వాన కురిపించలేడు;
మహా బలవంతుణ్ణని విర్రవీగే నరుడు
మండు టెండకు గుండె పగిలి చిందులు
తొక్కుతున్న వానరుడు

అణువును భేదించిన వాడు
చినుకును కురిపించలేడు

నిర్జల నిశ్శబ్దంలోంచి
వినిపిస్తూంది జల సంగీత విపంచి

ఇంద్రధనుష్టాంకారం
ఇలా జీవులకు ఓంకారం

చిక్కి శల్యమైన కృష్ణానది
చిందులేస్తూ ప్రవహిస్తున్నది

ఉందా లేదా అనిపించే గోదావరి
హుందాగా ఊళ్ళోకి చొరబడుతూంది సరాసరి

గజ్జె కదలించలేని 'మంజీర'
గల్లు గల్లున మ్రోగుతూంది ఊరూర

గుండె పగిలిపోయిన గండిపేట
నిండు చూలాలు వలె కనిపిస్తూందీ పూట

ఇది వర్షపాతం కాదు, హర్షపాతం!
ఇది అయిదు కోట్ల ఆంధ్రుల ఆనందగీతం!

# ముక్తక ముక్తావళి

రాజకీయవహ్ని రగిలి నందన వాటి
పారిజాత తరువు వాడిపోయె,
పూలు దోయిలించబోయిన నా ముందు
కంటకముల రాశి కంట బడెను.

జాతికొఱకు బ్రతికి జాతికై చితికిన
జాతి పితను మరువ జాలినారు,
మనను మోసగించి మన వెన్ను పొడిచిన
వానినే జపించ బూనినారు

నిన్న మొన్నదాక నే సామవేదిని,
సామ్యవాదినైతి క్షణములోన
కూలి జనుల మేలు గూర్చి భాషింతును,
తట్ట మోయుటన్న తప్పుకొందు

విశ్వమానవులను ప్రేమించవలెనందు
ఇంటి ప్రక్క వాని నీసడింతు,
అన్ని భాష లొకటెయని బోధనములాయె
తెలుగు బాస యనిన చులక నాయె

నన్నపార్యుడన్న కన్నెఱ్ఱ నాయెను
తిక్కన యనగానె తిక్క పుట్టె,
సరిగ పేరు పలుకజాలక పోయినన్
ప్రేంచి కవులమీద ప్రేమ నాకు!

ఆంగ్లభాషవ్రాతు వ్యాకృతి విడకుండ,
తెనుగుకేల వ్యాకరణ మటందు,
ఇంగిలీషు నుచ్చరించ నాగరికత,
మాతృభాషలోన మాట మోటు.

త్యాగరాజ కృతులు తలనొప్పి యాయెను
అన్నమయ్య పదములన్న పడదు,
వీణ మీటుటన్న వెక్కసంబాయెను
"జాజు" మీద నాకు మోజు హెచ్చె

శాసన సభలోన సభ్యత్వ మాశింతు,
శాసనాలటన్న చాల విసుగు,
ధిక్కరించు టొకటె తేలిక పనియాయె
అమలు జరుపుటన్న శ్రమనిపించె

మంత్రి పదవి కొఱకు మహనీయు లిండ్లకు
తిరిగి తిరిగి కాళ్లు అరిగిపోయె,
తుదకు వేరొకండు పదవి సాధించెను;
కక్ష కొలది వామ పక్షినైతి!

లంచమడుగువాడు లక్ష్మీపతిగ మారె,
నీతిపరుని కడుపు నిండదాయె
శాంతి కోరు వాని గొంతునే కోసిరి,
హంతకులకు జడిసి రధికబలురు.

కన్యకామణులకు కాన్వెంటు చదువులు,
కొడుకులకు విదేశి బడుల చదువు,
ఆంగ్లవిద్య మనకు అక్కరలేదని
బోధ సేయుచుండు పొద్దు మాపు!

కాపి కొట్టు హక్కు కలదని విద్యార్థి
జాగ్రపీని తెచ్చె సైన్సు నాడు,
ప్రశ్న కేమివ్రాయు ప్రత్యుత్తరమ్మును?
మార్కు ననుసరించె, మార్కురాక!

అరచి, మగనికొట్టి మొరపెట్టు ఆలిని,
గుడ్డ తడిపి గొంతు కోయు వాని
మాట మూట లిచ్చి ఓటు లాగెడివాని
కలలనైన నమ్మవలదు, శరధి!

పిట్ట గూడు పోలె జుట్టు పెంచితి నేను
క్షౌరశాల లన్ని ఆరిపోవ,
నూలు మిల్లులకును తాళాలు పడునేమొ
హిప్పి నైతి గుడ్డ విప్పి వైచి.

తల్లి! నిను ముక్కలొనరింప దలచు వారి
ఆశ లడియాసలైయున్న అవసరాన
నీ పదమ్ములపై తలమోపి నేడు
చిందు చుంటి ఆనందాశ్రు బిందువులను

# నేనంటాను

కళ్లెం ఉన్నది మనచేతిలో,
గుఱ్ఱం మాత్రం పడెగోతిలో;
దప్పి తీరదని నేనంటాను
నీళ్లే అందని మన నూతిలో

పడవ నడపలేనివాడు నావికుడు
పదము పాడలేనివాడు గాయకుడు
అందుకనే వేదనతో నేనంటాను
ప్రజల నడపలేనివాడు నాయకుడు!

పైపై సొగసులు కల్లసుమా!
లోపలిదంతా డొల్లసుమా!
నిజం తెలియుమని నేనంటాను
లేదా కొంపే గుల్లసుమా!

నింగి కితాబుగ చేశాను
చుక్కల హిసాబు వేశాను
ప్రేయసి కోసం వేచీవేచీ
తుదకు మంచమే వేశాను

బండను కోయాలి కుసుమదళం
గుండెను కోయాలి నయనజలం
కదనరంగమున, నేనంటాను
కత్తిని మించాలి కవుల కలం

నవబాష్పధారలో నవ్వు కాగలవు
ముళ్ల తీగెలలోన పువ్వు కాగలవు
యత్నించి చూడమని అంటాను నేను
రాళ్ల రాసులలోన రవ్వ కాగలవు

నిన్నటిదర రెండింతలు పెరిగింది ఈ ఉదయం
మొన్నటిధర మూడింతలు పెరిగిందీ సాయంత్రం
అన్నిటి దర పెరిగినా, నేనంటాను
ధర పెరగని సరుకొకటే—మానవప్రాణం!

డబ్బుకొరకు గడ్డితినని రోజులకోసం,
వెలకై రవళించబోని గాజులకోసం
అందరమూ కృషిచేయాలంటా నేను
అట్టడుగున ఉన్న జనుల మోజులకోసం

కోటినదులు పోలలేవు ఒక్క సింధువుని
కోటితారలు పోలలేవు లోకబాంధవుని
అందుకనే గళంవిప్పి నేనంటాను
కోటినేతలు పోలలేరు ఒక్క గాంధీని

రోజొక రాజు దిగిపోయె
రాజ్యం ప్రజాళి పాలాయె
దండుగ రాజుల నమ్మినవారికి
తండులమ్ముతే కరువాయె.

బిరుదూ, సనదూ ప్రతి మానవుడికి కావాలి
పదవీ, హోదా ప్రతి పౌరుడికీ కావాలి
ప్రభుత మెప్పును బడిసిన పిమ్మట ఏంకావాలి?
ప్రజల మెప్పుకై ప్రభుతను దెప్పట కావాలి!

కంఠశోషతో రానేరాదు సోషలిజం
రైతుకూలి మేధావులు కలపండి భుజం భుజం
ఢిల్లీనుంచి దిగుమతి చేసే సరుకిదికాదు
విచ్ఛిన్నకుల ఓడిస్తే అదివచ్చేనయ్యా నిజం నిజం

భారతీయులది భాగీరథి
పాకీయులది రావీనది
నదులెట్లున్నా, నేనంటాను
కలుసుకోవలె హృది, మది

ఉత్తరానగల హిమాచలం
దక్షిణానగల జలధిజలం
మన అందరిదని నేనంటాను
ఐకమత్యమే మనకు బలం

వీరంగం వేస్తుంటే రాదు విప్లవం
తారంగం పాడుతుంటెరాదు సమరదం
అందుకోసమే, నేనంటాను
ఏ లేహ్యం తిన్నాగాని రాదు యౌవనం!

రక్తం నదులై పారకపోతే రాదా రెవల్యూషన్?
బుర్రలు బుర్రలు పగులక సమస్యకు లేదా
సొల్యూషన్?
హింసా, యుద్ధం ఔట్ డేటెడ్ అని నేనంటాను—
శాంతి ఒక్కటే మానవజాతికి సరియగు సొల్యూషన్.

# కర్తవ్యము

భగభగమండు భాస్కరుడ
        వై వెలుగొందుట వీలుకానిచో
సొగసులు చిందు చుక్కవయి
        శూన్య నభమ్మున శోభ నింపుమా!
జగతి మహా వటంబవయి
        శాఖలు సాచకయున్నమానె, సం
పెగవయి తావులన్ చిలుకు
        మీ! రసికావళి గుండెలందునన్

రథములు సాగిపోవగల
        రాజపథంబవు కాకపోతివన్
వ్యథ వలదోయి; కాననము
        లందున సన్నని కాలిబాటవై
కదలుము, పెదపాదములు
        కంటక రాశి భరింపలేక నీ
యెదపయి సేద తీర్చుకొను
        చేగును కాల మహా పదమ్మునన్

జ్యోతిర్గోళమవై దిశాంచలములన్
        శోభించ లేకున్నచో
నీ తేజమ్మును చిన్ని తిర్వ్యాళికలో
        నిండింపుమీ; అంధకా
రాతంకమ్ము తొలంచు కీలికలు నీ
        యందున్నవోయీ! జయో
పేతా! నమ్రత నీకు రక్షయయి క
        ల్పించున్ మహానందమున్

దమ్ముంటే తోటలు నాటు,
ఈటెలు నాటుట మానుమురా!
బలముంటే కలమును నడుపు,
కలహము నడుపుట కూడదురా!
శక్తి ఉంటె రసాన్ని చిందు,
రక్తం చిందుట నేర్వకురా!

వీలైతే ప్రణయం పెంచు,
ప్రళయం దించుట ఘోరమురా!
మనసైతే మల్లెలు విసరు,
రాళ్ళను విసరుట వద్దుసుమా!
అడిగినచో దారి చూపు,
పెడదారి చూపడం తగదుసుమా!

## శాస్త్రీయ పాకం

బ్రతుకుపై విసుగెత్తినవాడు, విషము
త్రాగి ఆత్మహత్యకు బూనదలచనేల?
పాకశాస్త్రము ధరియించి వంట చేయు
వనిత చేతి వంటకమును తినిన చాలు!

# వంధ్యామేఘాలు

నాడు పానపాత్రలో మిగిలిపోయినంత మధువు
ఈనాడు పానశాల మొత్తంలో కనపడదు

నాడు నయనాలలోనుండి తొణికినంత నీరం
ఈనాడు మన వూరి రిజర్వాయర్‌లో కానం!

ఈ వంధ్యామేఘాలు సంధ్యాసమయాన యెందుకు రావడం ?
కుహనా గర్భాలతో మొహంచూపించి యెందుకు పోవడం?

క్షారసాగరం ఈనాడు మాకు క్షీరసాగరం!
తాగడానికి వీలుకాకున్నా తానమాడవచ్చు అందరం.

# పరిషద్దేవాలయము

పరిషదాలయ పావనప్రాంగణాన
గడపిన క్షణాలు మరచిపోగలనె నేను?
సార సారస్వతామృతాసారమందు
తడిసియు జీవితమ్ములు కృతార్థములుగావె?

కలము పట్టనేర్పి, గళము విప్పగనేర్పి
కవిత వ్రాయనేర్పి, క్రాంతినేర్పి
నరమునరమునందు నవతానలజ్వాల
నింపినట్టి తల్లినే నుతింతు.

తెలుగు దీపమ్ము నార్పగా దలచినట్టి
తులువలకు శాస్తిచేసిన వెలుగు వీవు,
కాలిపోయిరి వారు నీ జ్వాలలందు,
నిలిచియుంటిమి మేము నీ వెలుగులందు.

ఓ పరిషన్మణీ! కవితలూరు రసాంచిత సాహితీ ధునీ!
నూపురనాదమేదుర మనోహర దివ్యకళా యశస్వినీ!
దీపమ వీవు నా హృదయ దేహళిపైన, ప్రభాప్రదాయినీ!
నీ పద పంకజాతముల నీడలు నా అపరంజి మేడలే.

హృదయ కేదారములనెల్ల పదను చేసి
పంటపండించెదరు నీదు పండితాళి;
రుగ్నమైయున్న మనసుల రుజనెరింగి
వైద్యమొనరించెదరు నీదు భావుకాళి.

రాజధానిలోన రోజొక పండుగ
నీ గృహాంగణమున సాగుచుండు;
జనుల గుండెలందు సాహితీ వాసనల్
పరపు కావ్యకుసుమ తరువ వీవు.

పాతికయేండ్లు దాటినవి, భారతి! నీ దరహాసచంద్రికా
శీతలరోచిరుజ్జ్వల నిశీథులలో కవితా మరంద పా
నాతత మామకీన హృదయమ్ము దిశాళి ప్రతిధ్వనింప నీ
గీతము లాలపించుచు; ముగింపులు లేనివి నీ కథావళుల్

నా నిశ్శ్వాసము లాగిపోవువరకున్ సాగింతు సారస్వతో
ద్యానం బందనవద్య పద్యరచనా వ్యాసంగమున్, నీ కృపా
ధీనంబైనది నాదు జీవితము; నిర్దేశింపుమీ ఆంధ్రలో
కానన్ శాంతి సుఖమ్ము లేర్పడి ప్రజాకళ్యాణమౌనట్లుగా.

రామకృష్ణ, రామనుజరాణ్ణరోత్త
మాది పారిషదుల కభివాదములివె,
వారి అవిరామ కృషి మహాఫలమ వీవు,
ఆంధ్ర పరిషత్పవిత్రి! జోహారులమ్మ!

---

ఆంధ్ర సారస్వత పరిషత్తు, రజతోత్సవ సందర్భమున విరచితము.

# విప్లవ వీరుడు

గాంధీ జయంతి శుభ సమయాన
గగనవాణీ వేదిక పైన
కవీంద్ర సమ్మేళనంలో
గజేంద్రుడిలా 'పాహిమాం' అని
నిస్సహాయగీతం పాడలేను

నిరాశా, దురాశలు
నిరంతరం దాడిచేస్తున్న ఈనాడు
ఆశావాదిని నేను,
అలో లక్ష్మణా! అని అలమటించలేను

ఒకపూటే తింటున్నవాళ్ళను చూశాను
రెండుపూటలూ పస్తులుంటున్న వాళ్ళను కలిశాను
నేనూ తిన్ననాడు తిన్నాను
పస్తులున్ననాడు వున్నాను

నేను త్రేతాగ్నిలో ఒక అగ్నిని;
కర్షక, కార్మిక, కవిశక్తులు
కలసి, వెరసి త్రేతాగ్ని అనుకునేవాణ్ణి.

ఈ నగ్నోద్విగ్న త్రేతాగ్నికి
నవసమాజ నిర్మాణ ధర్మ కర్మ నిష్ఠాపర
అనేకానేక మహాప్రజా హృదయ రుధిరధార, ఆజ్యధార

అమ్మా! భారతీ!
నేను మరోదేశాన్ని అనుసరించి
అనుకరించి
అడుగు ముందుకు వేయలేను

నా సమస్యలు నావి
నా పరిష్కారాలు నావి
నా ప్రాబల్యాలు నావి
నా దౌర్బల్యాలు నావి

నా జాతి గత జీవితాన్ని
వర్తమాన కాలంతో కూడి
భవిష్యత్తుతో హెచ్చవేసిన
పక్కా లెక్కల మేష్టారు
ఆ బోసినోటి మహాత్ముడు.

అయినా—
చుక్కల్ని లెక్కపెట్టగలంగాని
ఆకలి డొక్కల్ని లెక్కపెట్టగలమా!

మన బాపూ—
ఒక్క కరుణామయమైన తన చూపుతో
ఆసేతు హైమాచల విశాలోపఖండమండిత
మానవావళి జీవనాడీ వివిదగతులను
ప్రజాహృదయకమల సంకోచవ్యాకోచ తతులను
తన ఖద్దరు కొల్లాయి అంచున
లెక్కకట్టి దాచుకున్నాడు.

వెనకడుగు వేయడం యెరుగని వెట్టివాడు
ముందడుగు వేయడమే తెలిసిన ముసలివాడు

రేపు తన గుండెల్లోకి దూసుకు పోబోయే
తుపాకీ గుండ్లకు అడ్డొస్తుందేమో నని
ఉత్తరీయాన్ని సైతం ఎత్తిపారేసి
ఛాతీ సాచి నిలచిన భవిష్యద్వేధి, విప్లవవాది:

పాకీ చీపురుతో—
పరమదుర్వాసన వేసే మరుగుదొడ్లు కడిగి,
మరుగు దొడ్లకంటే మురుగు కంపువేసే
మనుష్యుల మనసులను కడగడానికి
మన దేశంలో వెలసిన మాన్యుడు బాపూ.

బాపూ!
నీ రూపు
నీ చూపు
దేవీ ప్రసాద్‌రాయ్ చౌదరి మలచిన
దివ్యకాంస్య విగ్రహంలో నిగ్రహంతో
అలా నిలబడివుంటే —
నీ పాదాల సమీపాన
పయోధి తరంగాలు పొరాడుతుంటే—
నిన్ను హతమార్చిన వాడికంటె నీచంగా
నీ దేశీయులు కొందరు నీ విగ్రహాన్ని
నిర్దయులై బద్దలు కొడుతుంటే
సిగ్గుతో తలవంచుకున్న మా గుండెల్లో
మల్లెమొగ్గలు వెదజల్లుతున్నావా! బాపూ!
నీకంటే విప్లవవాది యెవరు? బాపూ!

విప్లవం అంటే అర్థం తెలియనివారికి
పిస్తోలు పట్టినవాడే విప్లవవాది;
విప్లవం అంటే అర్థం తెలిసినవారికి
పిస్తోలుకు గురియైనవాడే విప్లవవాది.

నీవూ, ఐజెండే
లుముంబా, లూథర్ కింగ్!
మీకంటే విప్లవమూర్తు లెవరు?

పాపంలా పెరిగిపోతున్న పట్నాల్లో
కట్నాలకోసం కాచుకూర్చున్న గద్దల్ని
పల్లెల్లో రాట్నంవడికే భరతాంబ
పయనమై రమ్మంటోందని జ్ఞాపకంచేసిన
ప్రజామిత్రుడవు నీవు.

రాక్షసుడిలా కక్షకట్టిన
లక్షోపలక్ష జనసందోహ దుర్గంధ బంధుర
మహానగర కరాళ కరాలనుండి
చల్లని పల్లెల మల్లెతోటల్లో
కల్లా కపటం తెలియని
పిల్ల తెమ్మెరల బుల్లిచేతుల తాకిడికి
పులకించేలా ఎల్లజనాళిని
తరలండని పురికొల్పావు నీవు.

నీమాట యెవరు విన్నారు?

విన్నా, వినకున్నా
వినండని ఉద్బోధిస్తూ
ముందడుగు వేస్తున్న నీ విగ్రహాన్ని చూసి
ముందుకు చూస్తున్న నీ ఆకారాన్ని కాంచి
నిరాశ విసర్జించి
నిండు గుండెతో ముందడుగు వేస్తాను

నా దేశం ముందడుగే
నా ముందడుగు.

# భాగ్యనగర భాగ్యం

భాగ్యనగర భాగ్యమేమనాలి?
పయనమైంది అటు అశేష జనాళి!
తెలుగుతల్లి తిరునాళ్ళట!
ఆ తిరునాళ్ళు ఏడునాళ్ళట!

ఆదిలాబాదు నుంచి అనంతపురం దాకా
శ్రీకాకుళం నుంచి చిత్తూరు దాకా
కాశ్మీరం నుంచి కన్యాకుమారి దాకా
మారిషస్ నుంచి మలేషియా దాకా
అయిదు ఖండాలలోని ఆంధ్రుల ప్రతినిధులు
తెలుగుభాషమీద ఆసక్తివున్న విదేశీయులు
వేలయేండ్ల మన సంస్కృతి మాట
వివరంగా చర్చించుకుంటారట!

కాకతి రుద్రమ్మ కనిపిస్తుందట!
వీరమాంచాల వినిపిస్తుందట!
కృష్ణరాయుల వారి భువనవిజయం
రఘునాథరాయుల కొలువుకూటం
కాంతి, ధ్వని సంయోజనంతో
కనిపిస్తూ వినిపిస్తాయట!

నృత్తం, నృత్యం, నాట్యం, లాస్యం
గానం, పద్యం, చిత్ర విచిత్రం!
అందరి యెదలకు విందులు చేసే
సుందర తారలు వస్తున్నారట!

తెలుగుతల్లి కనకాభిషేకానికి
దేవతలే దిగివస్తున్నారట!
భూత భవిష్యద్వర్తమానములు
చేతులు కలుపుకు చిందులేయునట!

కర్షక, కార్మిక, కవి, గాయకులు
హలము, చక్రం, కలము, కంఠం
కలిసి తెలుగిదని తెలిపే రోజట!
తెలుగు జాతికిది యెంతో మోజట!

పదండిపోదాం భాగ్యనగరికి
ప్రపంచ సభలు జరుగు చోటికి

(ప్రపంచ తెలుగు మహాసభలకు ముందు విరచితం)

# ప్రణయక్రీడ

"నీలమేఘం కొండను చుట్టేసుకుంటే
నేల కనపడక, కొండశిఖరం ఎగిరి పోతోందని
అమాయక సిద్ధాంగనలు భయపడి
ఆలింగనం చేసుకున్నారు తమ ప్రియులను"
అన్నాడు కాళిదాసు ఆనాడు.

"వేగంగా వెళ్ళే స్కూటరు హఠాత్తుగా
ఆగిపోయేసరికి, యాక్సిడెంట్ అని భ్రమపడి
పిలియన్ మీద కూర్చున్న పిల్ల
సీటుమీది నీటుకాణ్ణి వాటేసుకుంది"
అన్నాడు కేళీదాసు ఈనాడు.

ఆనాడూ ఈనాడూ కూడా
ఇంచుమించు ఒకేరకం ప్రణయక్రీడ!

## తల్లి పూజకు తరలిరండి

నౌబత్ పహాడ్ మీదినుంచి చూస్తే
నాలుగుమైళ్ళ మేర అయినా కనపడదు

చార్‌మినార్ పైనుంచి పరికిస్తే
'సారా' హైదరాబాద్ సాక్షాత్కరించదు

గోలకొండ గోపురాగ్రంనుంచి దర్శిస్తే
కొంతదూరం మించి కంటికి కానరాదు

కానీ—
ప్రపంచ తెలుగు మహా సభామండపం నుంచి
పరికించి చూస్తే—
అఖిలాంధ్రోక్తిమయ మహాప్రపంచం
అక్షిగోచర మవుతుంది.

విశాలనీలాకాశ మంతటిది
విశ్వాంధ్ర ప్రజావళి హృది

వింశతి మండల పరిమితం కాదు
వేలేళ్ళుగా విస్తరించిన మన విఖ్యాత జాతి

సప్తసముద్ర సమావృత విశ్వంభరా పరి
వ్యాప్త మహామాతృదేవతా చేలాంచలం నీడలో
ఎన్నికోట్ల తెలుగువారు
ఎన్నెన్ని దేశ దేశాంతరాలలో
ఎలా ఎలా జీవిస్తున్నారో!
ఏమేమి సాధిస్తున్నారో।

నా తెలుగుతల్లి అనంత సంతానాన్ని
నా తమ్ముళ్ళను, అన్నలను
నా చెల్లెళ్ళను, అక్కలను
నా బంధువులను, బాంధవీజనులను
నయనానందకరంగా తిలకించడానికి
ప్రియాతిప్రియంగా పలకరించడానికి
వెళుతున్నాను నవశకాది ఉగాదినాడు
కలలు నిజమయ్యే కమనీయ కాకతీయనగరానికి

కలాన్ని జండా కర్రగా
కవితను కాంచన పతాకగా
గగనాంచలాల యెగరేస్తూ
పయనిస్తున్నాను పథికుణ్ణి
భవ్య భావనా రదికుణ్ణి

రండర్రా! మీరంతా
నిండుగుండెతో నా వెంట,
ఆంధ్ర మాతృదేవతా పాదాలను
అర్చింతాం అనురాగ కుసుమాలతో
అర్పింతాం హృదయాల కమలాలను

తల్లి పూజకు తరలి రండి
తరతమ భేదాలు మరచిపొండి

(సభలకు ముందు విరచితం)

# కాంతి కన్యకలు

ఆడండి ఆడండి కాంతి కన్యకలు!
పాడండి పాడండి ప్రగతి గీతికలు
మీ పాట విని, మీ ప్రభా నృత్యములు చూసి
పులకించినవి ప్రజా హృదయ మాలికలు

దివ్వెతో దివ్వె వెలగాలి
మనసుతో మనసు పెరగాలి
బాహిరంబౌ వెల్గు అంతరంబై నిల్చి
తామస ప్రకృతియే తరగాలి

కన్నులను కబళించ కదలివచ్చే తమము
కడుభయంకర భల్లుకముతోటి సమము;
కాంతి భల్లములతో భల్లుకమ్మును పొడిచి
శాంతి హంసావళిని యెగురవేయుదము

అజ్ఞాన భయదాందకార సర్పమ్ము
అవనిపై ఈనాడు చూపేను దర్పమ్ము,
ముందడుగు వేసేటి ముంగిసల దండులై
విషనాగములపైన విరుచుకొని పడుదాము

భావిభాగ్యోదయోజ్జ్వల భానుగోళమ్ము
పరదాలలో దాచ ప్రయతించగా లేము!
అంతదాకా కాంతి కన్యలాడాలి
ఆ నాట్యమును లోకమంత చూడాలి

శ్రమికజన ఘంటికా ధ్వానాలు వినిపించు
సమ సమాజాలయ ద్వారాలు తెరవాలి

# శాంతిబాల

'ఏడాదికి ఒకసారే
ఏతెంచును సంక్రాంతి'
అన్నమాట భ్రాంతి;
'శాంతి' నా పక్కనుంటే
రోజూ సంక్రాంతి,

ప్రాత స్సంధ్యను విరిసిన
లేత లేత రోజా
సాయం సంధ్యకు వాడుట
సత్యదూరమైన కథ

'శాంతిబాల' చెక్కిలిలో
గంతులు వేసే రోజా
కలకాలం తాజా తాజా

వర్షామేఘం తృటిలో
వానకురిసి కరగునని
అనుకొనడం వట్టికల్ల

'శాంతి' కురుల మబ్బులకు
కరగిపోవు గుణంలేదు,
ఎంతటి గ్రీష్మంలోనూ
చెంత వింత మేఘాలే!

ఆ మబ్బులు కురియువాన
అనురాగపు పూలసోన,

కలువలు, వెన్నెల రాత్రుల
నెలరాజును చూచినపుడె
నవనవలాడే ననుట
నమ్మరాని వెర్రిమాట

'శాంతి' నీలి నీలి కనులు
సాయం ప్రాతస్సంధ్యల
దివానిశల నెల్లపుడు
దీప్తిమంతములై తోచు

ఆప్తులవలె పలకరించు
తృప్తులవలె కానిపించు
శప్తుల ఆర్తిని తీర్చు;

గుమగుమలాడే పువ్వులు
కురులకు పరిమళ మొసగుట
అందరు చెప్పే మాట,
అందేమున్నది ఘనత?

'శాంతి' నీల శిరోజాలు
స్వయం సురభిళాలు
కుసుమాలకె ఆ కురులు
ఒసగును పరిమళాలు;

ఏ ఋతువున కారుతువే
వేరు వేరుగా వచ్చుట
అతిసాధారణ విషయం
అందు లేదు విశేషం;

ఆరు ఋతువు లొక సారే
అగుపించును ఆమెలో-
ఆ లేమలో;
ఆమె హృదయసీమలో
ఏలాటి ప్రేమలో!

ఆమె నన్ను చూడగానె
అంతరించె ఆ వేదన
ఆగిపోయె పెను రోదన
సాగె హృదయ పరిశోధన

## ఏది విప్లవం?

నవచైతన్యం పొంగే
యువకులార! మిత్రులార!
హింస నేర్వకండి మీరు
ధ్వంసం కాబోకండి

మేధా వికసనమునకై
మేటికృషిని చేయండి,
ప్రజలసమస్యలను తెలిసి
ప్రవర్తించ దలచండి

ఏదో ఒకదేశంలో
ఎపుడో ఏదో అయితే
అలాగె మనదేశంలో
అవాలని అనకండి

సమసింది పాతదనం,
క్షణక్షణం క్రొత్తదనం;
పాత ప్రపంచంవైపు
పరుగుతీయ దలచకండి

విప్లవమంటే మృత్యువు
విలయతాండవం కాదు,
విప్లవమంటే బాంబుల
వికటాట్టహాసం కాదు

విప్లవమంటే రక్తం
వెదజల్లుట కాదన్రా!
పీనుగుల గుట్టలనుండి
విప్లవాలు రావన్రా!

ప్రజలను మేల్కొల్పాలి
నిజమేదో తెల్పాలి;
హృదయాల్లో విప్లవాలు
ఎదగాలి!

# ఇంతి - పూబంతి -
# సంక్రాంతి

గుల్ల* నిండా నారింజ పండ్లు
కళ్లనిండా వలరాజు చెండ్లు;
పల్లెనుంచీ బంగారుబాల
వచ్చెనదిగో పొంగళ్ల వేళ

పట్నమంతా పులకించిపోయె,
ప్రజల మనసుల గిలిగింతలాయె,
నకిలి వేషపు నవనాగరికులకు
నగరిలోనే తలవంపులాయె!

చూపులోనా యెంతెంత కైపు!
నడకలోనా ఒక వింత ఊపు!
కొంటె కొంటెగ నవ్వేను బాల,
గుండెలందూ కలిగేను శూల

ఎపుడొ చెక్కిన ఎల్లోర బొమ్మ
ఇపుడు పట్నం ఏతెంచెనమ్మా!
వయసు బరువుకు ఊగేటి నడుము,
అడుగు తడబడ ఆడేటి ఉరము

విగ్రహాలకు ఆరాధనంటే
ఆగ్రహించే పిడివాదికూడా
పిల్ల తనకు కనిపించగానే
కళ్లతోనే పూజించసాగె!

---

* బుట్ట.

జడను కులికే సిరిమల్లె సరము
పడుచువానికి కలిగించె జ్వరము,
చదువురానీ ఆ పల్లెపిల్ల
చదువు నేర్పును పంతుళ్లకెల్ల

సహజసుందర ముఖబింబమందు
చందమామ అమృతాలు చిందు,
చక్కదనపు చెక్కిళ్ల పొంకం
ఎచట కానము ఈలాటి బింకం

ఊరి రౌడీ లోకచోట చేరి
చిన్నదానిని చెరపట్టదలచీ
యెత్తులెన్నో వేశారుగానీ
జిత్తు లేవీ ఫలియింపవాయె

గాలికెగిరే చెలి కొంగు పట్టీ
జాలిలేక లాగేటివారు
బొక్కబోర్లా పడ్డారెగానీ
చిక్కలేదు చిన్నారిచిలక!

ఆమె బుగ్గను ముద్దాడబోయి
అగ్గిసోకీ అల్లాడె నొకడు!
బుజముమీదా చెయి వేయబోయి
గజముదూరం కాళ్లారి పడెను!

పిల్ల అంతలో కనిపించదాయె
ఎల్లజనులకు ఆశ్చర్యమాయె;
భోగిమంటల సంక్రాంతి లక్ష్మి
పోకిరీలకు దొరికేది కాదు!

కవి కలానికి కనిపించగలదు
రవి కరానికి లభియించగలదు
సకల సంపద లందించగలదు
అందమంతా చిందించగలదు

ఎంత హాయి! సంక్రాంతి వేళ!
బంతిపూల బంగారుమాల!
కవి కలానికి కైపెక్కె నేడు,
రైతు ముఖము రంగెక్కె నేడు

పూలమీదా భ్రమరాలు వాలె
నేలమీదా గగనాలు సోలె
దూరతీరం కడుచేరు వాయె
భారమంతా ఇక తీరిపోయె

వద్దు వద్దని పరుగెత్తు బాల
సద్దుచేయక జతచేరె నేల?
మనసు మనసూ పెనవేయువేళ
మనిషి మనిషి మందారమాల

# సైనికుడికి సలాం

దేహానికి హృదయంలా
గేహానికి కుడ్యంలా
నగరానికి దుర్గంలా
దేశానికి సైన్యం

దేశం ఒక దేవాలయం
దేశమాత మన దైవం;
అమ్మను కాపాడుటకై
అల్లాడే ప్రతి ప్రాణం
ప్రభాత శుభ సమయంలో
విభాకర కరాంచలముల
విరిసిన నవారవిందం

పరాక్రమవంతమైన సైన్యం
పరిడవిల్లు మనదేశం ధన్యం;
కంటికి రెప్పలాగ
మన ఇంటిని కాపాడే
అన్నలకు తమ్ములకు—
ఆమని విరి కొమ్మలకు—
స్వాతంత్ర్య లతాగ్రంలో
పాటమరించు రెమ్మలకు—
స్వేచ్ఛా దీపజ్వాలిక
వెలుగుతున్న సెమ్మెలకు—
రణరంగంలో పోరాడి
మన విజయం సాధించిన
నా అగ్రజులకు, అనుజులకు
అంజలి ఘటించుతున్నా!

భారత సైనిక సోదరుడా!
పగవారిని భంజించుటలో
తల్లిపాద కమలాలను
హృదయ రుధిర లాక్షారసంతో
రంజించుటలో
నిన్నుమించి యెవడయ్యా!
మా జాతికి గర్వం నీవయ్యా!

నా తల్లి దాస్య శృంఖలాలు తెగి
స్వతంత్రమై విశ్వవిశాల మందిరంలో
రత్నఖచిత కాంచన కిరీటంతో
తలయెత్తి నిలబడినందుకు
—అది చూడలేక
కళ్లలో నిప్పులు పోసుకున్న
కుళ్లుబోతులు
ఒకసారి పశ్చిమంనుంచి
ఒకసారి ఉత్తరంనుంచి
ఒకసారి తూర్పునుంచి,
ఇలా ఎన్నిసార్లు ధండయాత్రలు చేయలేదు?
ఇలా ఎన్నిసార్లు మా స్వాతంత్ర్య గోక్షీరంలో
విషపు మాత్రలు వేయలేదు?
ఇలా ఎన్నిసార్లు వాళ్లు రావణాసుర పాత్రలు
ధరించలేదు?
అయితే యేం?
నీ క్షాత్ర శక్తి; నీ త్యాగ శక్తి —
మా స్వేచ్ఛా ముక్తా ఫలానికి శుక్తి;
మా హృదయాలకు అనురక్తి;
నాకు నీ ధైర్యమే భుక్తి, ముక్తి.

కుయుక్తులతో మనపై దాడిచేసిన
కుత్సిత కుంజరాల కుంభ స్థలాలపై
హర్యక్షంలా దుర్నిరీక్ష్యంగా లంఘించి
పంజాతో భంజించిన ఘటనలు
పద్యాలుగా అల్లుకుని
మంగళాక్షతలుగా చల్లుకుని
సంతోషించానయ్యా!

నేను నీ కేకలో
అలనాటి దుర్జయుడైన అర్జునుని
పర్జన్య గర్జా సదృశ శంఖానాదం విన్నాను.
కురుక్షేత్ర యుద్ధంలో దుర్యోధనుని తొడలు
తునాతునకలు చేసిన భండన భీముని
ప్రచండ ప్రతాపం నీలో చూశాను

నీ నయనాలలో— పరశురాముని రక్తరంజిత
పరశుచ్ఛటా పటలాలు కాంచాను,
నీ చేతుల్లో— హిరణ్యకశిపుని ఉదరారణ్యంలో
విచ్చలవిడిగా విహరించే
ఉగ్ర నారసింహుని ఖరకరనఖ కాంతులు దర్శించాను.

మృత్యువును ఓడించిన మృత్యుంజయుడవు నీవయ్యా!
చావుకు భయపడే చచ్చు దద్దమ్మలు
నీ ముందు ప్రాణంలేని పేడబొమ్మలు.
బాలభాను ప్రథమ కిరణాన్ని పింఛంగా ధరించి
భయంకర మారణాయుధాన్ని వేణువుగా వరించి
రణరంగ బృందావనంలో
విజయ పరంపరా గోపికాగణంతో
రాసకేళి సలిపే
రమ్య గోపాలకృష్ణుడవు నీవు

స్వాతంత్ర్య సీతను శాశ్వతంగా హరింపజూసే
శత్రు రావణ వినాశనం కోసం
పుంఖాను పుంఖంగా విశిఖాలు విడిచే
పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడవు నీవు,
నా కావ్యానికి నాయకుడవు నీవు;

భరత జాతికి అఖండకీర్తి తెచ్చిన మూర్తి నీది;
మేము సుఖంగా జీవించడానికి
మేము విశ్వంలో తలయెత్తుకు తిరగడానికి
మేము భారతీయులమని గర్వంగా చెప్పుకోవడానికి
యాభై కోట్ల మహాప్రజ, శాంతిని అనుభవించడానికి
నీవు శత్రువుపై లంఘించావు, దేశాన్ని రక్షించావు
నీవు కంచుకోటలా దేశం అంచుల్లో నిలబడ్డావు;
నీవు మా పంచప్రాణాల్లా మమ్మల్ని కాపాడావు.
మా పిల్లలు, ఇల్లాళ్లు, ఇళ్లు, వాకిళ్లు కళకళలాడడంకోసం
నీ ఇల్లాలిని, పిల్లలను మరచి రణరంగంలో దూకావు.

సాయుధ సైనికుడా!
నీ కథ వ్రాసెదరా!
నీ నడచిన పథాలలో
పూల రథం నడచెనురా!
నీ పోరిన విధం విని
మా ఎద పులకించెనురా!

ఒక్క తల్లి పిల్లలము
ఒక్క తీగ మల్లెలము
ఒక్క వాన చినుకులము
ఒక్క దివ్వె మినుకులము

కాశ్మీరం నిన్ను తలచి గర్వించింది
కన్యాకుమారి నిన్నే సదా స్మరించింది
వంగభూమి నీగళ రుధిరంతో పరిపూరితమైంది

భూరిగంగా తరంగాల్లో
నీ గుండెల గుసగుసలు వినిపిస్తున్నాయి,
మేఘ్నానది మేఘ గర్జనతో
నీ వీర శంఖా రవాన్ని ప్రతి ధ్వనిస్తున్నది

ఢాకా నీ రాకకు పులకించింది,
ఇనుప సంకెళ్లు తెగిన బాంగ్లా
నీకు కేలెత్తి సలాం చేసింది;
స్వేచ్ఛా వాయువులు పీల్చిన బాంగ్లా
నీ త్యాగానికి కృతజ్ఞతతో అంజలి ఘటించింది.

మంచుకొండ పరవశించింది;
మహాజలధి నీ పౌరుషగాదలు విని
మరీ మరీ ఆనందంతో ఉప్పొంగింది.
భారతీయ సైనికుడా!
నావికుడా!
వైమానికుడా!
నా జాతికి రక్షకుడా
ఎత్తైన గిరి శిఖరాన
ఎగురుతున్న భారత జాతీయ కేతన పటాగ్రాన నీ వున్నావు.
నీవులేని చోటేది?
నా హృదయ కేదారం నీది;
నా మనస్సు నీ కోసం
నలు దిక్కుల వెతుకుతుంది.

రేయిగాని పగలుగాని
నిన్నగాని నేడుగాని రేపుగాని
భరతమాత తనువుపైన
ఈగనైన వాలనీక
అప్రమత్త దృష్టితో
చలిలో, ఆకలిలో
మంచుకొండపై
మరి ఎడారిలో
గ్రీష్మంలో, హేమంతంలో
కీకారణ్యంలో, మరుక్షేత్ర మధ్యంలో
నిద్రమాని, సుఖం మరచి
అరి భయంకరుడవై, జన సుఖంకరుడవై
శంకరుడవై
కాపాడే ఫౌజీ భాయీ!
ఈ జాతి నీకు ఋణపడిందోయీ!

అందుకో నా నమస్సుమనస్సులు
అందుకో నా కవితా వచస్సులు,
ఈ బ్రతుకే నీ కంకితం;
నిను స్మరిస్తే ధన్యం మా జీవితం.

## తుల లేని చెలి

జాబిలి అందం, చెలి అందం
సరితూచాలను కున్నాను

షరాబు వద్దకు వెళ్ళాను
తరాజు లోపల వుంచాను

జాబిలి ఉండిన పళ్ళెరము
చప్పున చేరెను ఆకసము!

అందా లొలికే చెలిమోము
అవని నిలిచె నా కోసరము!

(ఒక ఫార్సీ కవితకు అనుసృతి;
మూల రచయిత పేరు తెలియరాలేదు.)

# వ్యత్యయం

నీవు పుట్టిన నాటి రోదన
నీకు జ్ఞాపకమున్నదా?
నీదు బందుగులెల్ల నవ్వుట
నీకు జ్ఞాపకమున్నదా?

అట్టులే నీ అంత్యసమయ
మ్మందు అందరు యేడ్వగా—
నీవు నవ్వులలోన తేలుట
నేర్చుకొనరా! సోదరా!

(పార్సీమూలం: [redacted]) సినాయి

అగ్నితో అగ్ని చల్లారు ననుట నిజము;
వెతలపై వెతలోర్చి పొందితిని సుఖము.

## ఆర్యభట్టుకు స్వాగతం

భారతీయ మేధా శక్తికి
పరమోత్తమ ఉదాహరణం
ఆకాశావకాశాలలో
ఆర్యభట్టు పరిభ్రమణం.

అఖిల ప్రజా ప్రయోజనం కోసం
అనంత శాంతి సాధనం కోసం
అణు విచ్ఛేదన చేశాం
అవనిలో అనేకుల్ని మెప్పించాం.

భూమినుండి వ్యోమానికి
వ్యోమం నుండి భూమండలానికి
నిచ్చెనలు వేసే ఆ రోజు
వచ్చింది మన దేశానికి ఈ రోజు

మన శాస్త్రజ్ఞులు కావించే
మహిమాన్విత ప్రయోగాలు
మానవాళి కంతటికి
ఆనంద సంధాయకాలు